
ఫిలిం ఆక్టర్
ఒక ఆక్టరుగాచేరి నెలకు రు 100/-ల నుండి రు 1,500/-ల వరకు సంపాదించాలని కోరిక వుంటే మాకు వ్రాయండి. మీరు ఎక్కువగా చదువు కొనకపోయినా పరవాలేదు. జాబులు యింగ్లీషులోనే వ్రాయాలి.
Director: Anand Film Service.
P.B. 19. Sitla Temple A. M. Amritsar.


# ఆంధ్రపత్రిక


మదరాసు రేసులు
1949-50
డిశంబరు మీటింగు
30-12-49 శుక్రవారం


**The Andhra Patrika, Madras.** } Regd. No. M. 1118 Vol. 36 No. 264 TUESDAY 27th DECEMBER 1949 వెల ఒకఅణా } **Founder: K. NageswaraRao**


# సిబ్బంది ఉపసంఘ నివేదికలో ఆంధ్రులకు అన్యాయం

## ఆంధ్రరాజధాని సమస్యపై తీవ్రతర్జనభర్జనలు

### విభజనసంఘ చర్చలలో మాంద్యం

చెన్నపట్నం, డిసెంబరు 26: విభజన సంఘంవారు కుమారస్వామి రాజాగారి అధ్యక్షతను నిన్న సమావేశమై, కంటన్నర చర్చలు జరిపి నేటికి సభ వాయిదా వేసిన అనంతరము విభజనసంఘంలోని ఒక తమిళసభ్యుడు పత్రికా ప్రతినిధులతో మాట్లాడుచూ ఇట్లుచెప్పెను. "నేడు మేము చెప్పతగిన వంతపని పూర్తిచేయలేదు. ఒక విధమైన ప్రతిష్టంభన ఏర్పడుతున్నది. ఆంధ్రసభ్యులు రాజధానీనగరము సంగతి చెప్పేవరకు మిగతా కార్యక్రమం నల్లేరుపై బండి వలె సాగిపోయెడిదే."

రాజధాని నగరసమస్య

ఇక తమిళులకు చెప్పే తాత్కాలిక రాజధానిని గూర్చి ఆంధ్రనాయకులు పరస్పరమూ సంప్రదింపులు జరుపుతున్నారు. వాల్తేరులో విశ్వకళాపరిషత్తు కళాశాలలు కొన్ని ఉంటే రాయలసీమలో మరొక విశ్వకళాపరిషత్ స్థానమూ కొన్ని శాస్త్ర కళాశాలలూ, పెడితే, హైకోర్టు రాయలసీమకిచ్చి అందరికీమధ్యగా ఉండే విజయవాడ రాజధాని పెట్టుకోవడం శాశ్వతమైన ఏర్పాటుగా బాగుంటుంది, అని కొందరు ఆంధ్రనాయకులు అంటున్నారు. ఈ శాశ్వతమైన ఏర్పాటుకు రాయలసీమ నాయకులు కాదనడంలేదు. కాని వారివాద మిటుల ఉన్నది.

"ఇప్పుడు చెప్పవలసినది తాత్కాలికమైన రాజధాని మాత్రమే. రాజధానినో, హైకోర్టునో ముందు కోయకునే హక్కు మాకిచ్చామని ఆంధ్ర నాయకులు ప్రమాణంచేశారు. మేముగూడా రాయలసీమ వాసులు రాష్ట్రంలో చేరడానికి విముఖులై ఉన్నప్పుడు ఈఒప్పందాన్ని చూపి దారికి తెచ్చాము. ఆ ప్రమాణాన్ని పాలించే సమయం వచ్చింది. ఈ ఒడంబడికను ఆంధ్రనాయకులు మన్నించారన డానికి రాయలసీమవారికి అవకాశం ఇస్తే వారు ప్రస్తుతం రాజధానినే కోరేస్థితిలో ఉన్నారు. గాక వారి కోర్కె న్యాయమైనది."

ఒక రాయలసీమనాయకుడు రాజధాని సమస్యనుగూర్చి ఇటుల వివరించెను "విజయవాడ ఆంధ్రదేశానికంతకు మధ్యగా ఉంటుందనీ, అందరికీ అందుబాటులో ఉంటుందనీ, మాకు తెలుసు. కోస్తానాయకులు శ్రీ బాగ్ ఒడంబడికకు బద్ధులై ఉన్నారుగనుక, దీనికి ప్రథమపరీక్ష రాజధానీ నిర్ణయం అయిందిగనుక రాజధానీ హైకోర్టు నిర్ణయంకేవచ్చినప్రుడు రాయలసీమవారు ప్రస్తుతానికే రాజధానినేవరించే మనస్సుతో ఉన్నారు. అనంతపురం రాజధాని అయితే భవనాలు హంగులున్నవి. రాయలసీమవారు రాజధానినివరించినప్రుడు కోస్తాసోదరులూ రాయలసీమవారూ అంతా కలిస్తే శాసనసభ్యులు, రాష్ట్ర కాంగ్రెస్ సభ్యులూ, నామకరణం చేస్తారు. అలుసేదు, చూలు లేదు, బిడ్డ పేరు సోమలింగం అన్న చందంగా దెబ్బలాడుకోగాదు. కృష్ణదేవరాయలు, అష్టదిగ్గజాలూ తాండవించి ఆంధ్ర సరస్వతీమతల్లికి విహారస్థలమైన రాయలసీమలో ఇన్నాళ్లకు మరల ఆంధ్ర ప్రభుత్వపీఠం స్థాపించబడడం సముచితంగా ఉన్నది. అనంతపురానికి సమీపంలోనే లేపాక్షి దేవాలయంలో కళా నైపుణ్యం ఇప్పటికీ ఉట్టిపడుతూ అనంతపురం మండలం ఆంధ్ర కళా ప్రపంచంలో తారవలె ప్రకాశిస్తూ ఉన్నది. అట్టి అనంతపురంలో రాజధాని తాత్కాలికంగానైనా నిర్ణయించుమని కోరుతున్నాము."

### విభజనసంఘ కార్యకలాపం

#### పత్రికలలో వ్యాఖ్యలు చేయరాదని నిర్ణయం?

మదరాసు, డిసెంబరు 26: విభజనసంఘము నేటి ఉదయం 8-30 గంటలకు మంత్రివర్గ మందిరమున సమావేశమై విభజనసంఘ కార్యకలాపములపై సంపాదకీయ వ్యాఖ్యలు చేయవలదని పత్రికాధిపతులకు విజ్ఞప్తిచేయుటకు నిశ్చయించినట్లు తెలియుచున్నది. విభజనసంఘ కార్యదర్శి శ్రీ యస్. వెంకటేశ్వరన్ ఐ. సి. యస్. పత్రికాధిపతులతో మాట్లాడెదరని విభజనసంఘ సభ్యుడొకరు సమావేశానంతరము బయటకు రాగానే మా విలేఖరికి తెలిపిరి.

నేటి ఉదయం సమావేశము 9-30 వరకు జరిగెను. ఆస్తి, అప్పుల పంపిణీగురించి ఆర్థిక ఉపసంఘము వారి నివేదికను చర్చించినట్లు తెలియుచున్నది.

సిబ్బంది, నౌకరీల ఉపసంఘము వారు నిన్న సమావేశమై నివేదికను పూర్తిచేసిరి. అయితే ఇంకను వారి నివేదిక విభజనసంఘమునకు చేరలేదు. విభజనసంఘము రేపు ఉదయం సమావేశమైనప్పుడు సిబ్బంది ఉపసంఘమువారి నివేదికను చర్చించెదరని కూడ తెలియుచున్నది.

## రాష్ట్రంవచ్చినా పెద్ద ఉద్యోగాలలో తిరిగి తమిళులే వుండే ప్రమాదం

### "సీనియార్టీ" చెడకూడదని నివేదికలో షరతు

మదరాసు, డిశంబరు 26: ఆంధ్రరాష్ట్ర సిబ్బంది ఉపసంఘం వారి నివేదిక తయారయి కొందరు విభజనసంఘ సభ్యులకు అందజేయబడినట్లు తెలియుచున్నది.

నూతనరాష్ట్ర ప్రభుత్వమునందు సిబ్బందిని నియమించునపుడు ఇపుడున్న మదరాసురాష్ట్ర సిబ్బందిలో ఆంధ్రులనుమాత్రమే తీసుకోరాదనియు, అట్లుచేసిన పరిపాలనా సమర్థత చెడునుగావున, ఎస్టాబ్లిషుమెంటు సీనియారిటీ చెడకుండ విభాగించాలనియు, ఈనియమం గెజెటెడు నానుగెజెటెడు ఉద్యోగులందరికీ వర్తింపజేయాలనియు ఉపసంఘంవారు సూచించిరి.

అనగా ఇపుడు సెక్రటేరియటులో నున్న ఉద్యోగులలో ఆంధ్రులనుమాత్రమే ఆంధ్రరాష్ట్రానికి పంపినచో దిగువ ఉద్యోగాలవారిని పెద్దఉద్యోగులుగా మార్చవలసివచ్చును. అట్లాగాకుండా ఆంధ్రఉద్యోగులు కొందరు తమిళఉద్యోగులనుగూడ స్థిరంగా ఆంధ్రరాష్ట్రమునకు పంపుట అవసరమని వారుసూచించిరి.

ఆంధ్రమండలాలలో కుటుంబాలు స్థిరాస్తులు బంధువర్గం ఉన్నవారొక తెగ, మదరాసునగరం చెంగల్పట్టుజిల్లాకు చెందిన ఆంధ్రులు ఒక తెగ, అరవదేశంలో పుట్టి పెరిగిన ఆంధ్రులు మూడో తెగ, మూడు తెగల ఆంధ్ర ఉద్యోగులు గలరు. ఈ మూడు తెగలవారిని ఆంధ్రరాష్ట్రానికి పంపే అవకాశం ఉంచి, కొందరిని నిర్బంధంగా వెళ్లమని, కొందరిని ఐచ్ఛికంగా ఎంచుకోమని కోరుటకు అవకాశముంతురని తెలియుచున్నది.

ఈ యేర్పాటు ప్రకారం, సీనియరు ఉద్యోగులందరు యిపుడు మదరాసులో ఎక్కువమంది ఆంధ్రేతరులే యున్నందున, వారు ఆంధ్రరాష్ట్రంలో స్థిరోద్యోగులుగ నుండవలసివచ్చును.

ఉపసంఘంలో ఓ. పుల్లారెడ్డిగారొక్కరే తెలుగు సభ్యులు. ఎస్. వెంకటేశ్వరను, కె. రామునివాసనుగార్లు ఇతర సభ్యులు.

### విభజన సంఘంలో క్రొత్త ప్రతిష్టంభన

మదరాసు, డిశంబర్ 26: ఆంధ్రరాష్ట్ర విభజనసంఘం నేడుదయం సమావేశమయినాక, నేడు మధ్యాహ్నం ఆంధ్రసభ్యులు శ్రీ గోపాలరెడ్డి గారియింట ప్రత్యేక సంప్రదింపులు జరిపిరి.

మదరాసు నగరంలో ప్రభుత్వ ఆస్తి అయినటువంటి భవనములయొక్క నష్టపరిహారం ఆంధ్రులయిపుడు కోరరాదనియు, అట్లు కోరినచో చెన్నపురమునందున్న ఆంధ్రులగతి అధోగతియగునని, చెన్నపురం ఆంధ్రరాష్ట్రంలో చేరగోరలేదేగాని, ఆంధ్రులకు చెన్నపురిపై హక్కులు పోలేదు గనుక, ఉత్తరోత్తర నగరం ప్రత్యేక రాష్ట్రముగా నిర్మింపబడుటకు అవకాశం చెడకుండుటకై యిపుడు, భవనముల నష్టపరిహారం కోరరాదనియు, విభజన సంఘంలో ఆంధ్ర ప్రతినిధులలో ఒకవర్గం అభిప్రాయమైయున్నది. ఇందుకు అరవ ప్రతినిధులంగీకరించలేదు. ఈ విషయమే ప్రస్తుతం సంప్రదింపులు జరుగుచున్నవని తెలియుచున్నది.

రేపుదయం విభజనసంఘసభలో యీ విషయము సిబ్బంది ఉపసంఘ నివేదిక చర్చింపబడవచ్చును.

## రాజధానీ సమస్య

### ఆంధ్రరాష్ట్రకాంగ్రెస్ కార్యవర్గం చర్చ

#### నగరంలో జనవరి 3, 4 తేదీల్లో సమావేశం

విజయవాడ, డిసెంబర్ 26: ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కార్యవర్గం జనవరి 3, 4 తేదీలలో చెన్నపట్నంలో సమావేశం కానున్నది. అధినివేశ శాసనసభ ఎన్నికకు అభ్యర్థుల నిర్ణయించడం, ఆంధ్రరాష్ట్రం, రాజధాని హైకోర్టు మొదలగు విషయములు ఈ సమావేశములో చర్చిస్తారని తెలిసింది. అధినివేశ శాసనసభకు ఆంధ్ర ప్రాంతమునుంచి ఎన్నుకోవలసిన సభ్యులను, చెన్నరాష్ట్ర శాసనసభలు రెండింటిలోనూగల ఆంధ్ర సభ్యులు పేర్కొంటారనీ వారిని రాష్ట్రకాంగ్రెస్ కార్యవర్గం ఆమోదించవచ్చునట. రాష్ట్ర శాసనసభల కాంగ్రెసుపక్షం ఎన్నుకొంటుందనీ, తెలిసింది. జనవరి 26 కి ఆంధ్రరాష్ట్రం ఏర్పడవచ్చుననే ఉద్దేశంలోనే ఇట్లా చేయనున్నారట.

రాష్ట్ర శాసనసభలలోని రాయలసీమ సభ్యుల సమావేశాన్నొకదాన్ని కూడా రాష్ట్రకాంగ్రెస్ జనవరి 4 న చెన్నపట్నంలో ఏర్పాటు చేస్తున్నది. దీనికి రాయలసీమ జిల్లాబోర్డుల అధ్యక్షులను జిల్లా కాంగ్రెస్ సంఘాల అధ్యక్షులను కూడా ఆహ్వానించుతున్నారు. ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి సంబంధించిన అవసర సమస్యలను చర్చిస్తారట.

### ఆంధ్రమహాసభ కార్యవర్గ సమావేశం

#### 30-న బళ్లారిలో

గుంటూరు, డిసెంబరు 26: ఆంధ్రమహాసభ కార్యవర్గ అత్యవసర సమావేశం బళ్ళారిలో 30-వ తేదీ మధ్యాహ్నం 12 గం. కు జరుగుతుందనీ, ఆ రోజున అక్కడికి రానున్న రాష్ట్రవిభజన సంఘ సభ్యులను సందర్శించడమవుతుందనీ, సభ్యులంతా ఇదే ఆహ్వానంగా ఎంచి హాజరు కావాలనీ గు. వెం. పున్నయ్యశాస్త్రి గారు వ్రాసిరి.

## కలకత్తాలో దుండగుల మూకపై తుపాకికాల్పులు

### బాంబులువిసిరి, రాళ్లురువ్వినందున ఆత్మరక్షణకు పోలీసుల చర్య

కలకత్తా, డిసెంబర్ 25: నేటి సాయంత్రం పార్కు సర్కస్ మైదానంలో తమ మీద దాడిచేసిన జనసమూహంపై పోలీసులు 7 సార్లు కాల్పులు జరిపారు. కాల్పుల వల్ల ఎవరూ గాయపడనట్లు తెలుస్తున్నది.

మైదానంలో కమ్యూనిస్టుల ఆధ్వర్యాన ఒకసభ జరుగుతుండగా పోలీసులు అవాంతరాలు జరక్కుండా దగ్గరగానిలబడి ఉన్నారు. కొంతమంది ఉపన్యాసకులు ప్రసంగించినతరవాత జనం హఠాత్తుగా పోలీసులమీదకు బాంబులు, రాళ్లు మొదలైనవి విసరటం ప్రారంభించారనీ, దీనిమీద పోలీసులు బాష్పవాయువును ప్రయోగించి, అది లాభంలేకపోయేటప్పటికి కాల్పులు జరిపారనీ తెలుస్తున్నది చెదిరిపోయి జనం మళ్లీ ఒకసారి రెండు పోలీసువశాలమీద బాంబులు, ద్రావకపు బుడ్లూ విసిరారట.

జనం దాడివల్ల ఇద్దరు పోలీసు ఉద్యోగులూ, ముగ్గురు పోలీసులూ గాయపడ్డారని ప్రభుత్వ ప్రకటన తెలియజేస్తున్నది.

జనం అయిదు ట్రాంకార్లకు నిప్పుముట్టించగా ఒకటి పూర్తిగా ధ్వంసమైపోయినదనీ, మరి రెండు బాగా కాలిపోయినదనీ, ఒక ప్రభుత్వ బస్సుకూడా దాడికి గురిఅయినప్పటికీ ఆటే దెబ్బతినలేదనీ ప్రభుత్వ ప్రకటన వెల్లడించినది.

హౌరాలో సంఘర్షణ

నేటి సాయంత్రం హౌరాలో, ఒక సినిమాహాలుఎదట 144 వ సెక్షనుకు విరుద్ధంగా ఒకఊరేగింపు వెడుతుండగా పోలీసులు అటకాయించారనీ, అప్పుడు జనం బాంబులవిసరటంవల్ల ఇద్దరు పోలీసులు గాయపడ్డారనీ తెలియవచ్చినది. బాంబులుపడ్డవంటనే పోలీసులు లాటీచార్జి చేసి జనాన్ని చెదరగొట్టి, అనేకమందిని అరెస్టుచేశారు.

న్యూఢిల్లీ, డిశంబరు 25: రషీద్ అలీగారిస్థానే వాణిజ్యశాఖ సహాయ కార్యదర్శి ఎస్. కె. బెనర్జీ ఫ్రెంచి ఇండియాలో భారతీయ కౌన్సల్ జనరలుగా నియమింప బడినారు; ఈ నియామకమునకు ఫ్రెంచిప్రభుత్వం ఆమోదం సూచించినట్లు తెలుస్తున్నది.

## భారత రిపబ్లిక్ తొలి అధ్యక్షుడుగా డా॥ రాజేంద్రప్రసాద్ ఏకగ్రీవంగా ఎన్నిక అయే అవకాశం

న్యూఢిల్లీ, డిసెంబరు 26: రాజ్యాంగ పరిషదధ్యక్షులు డా॥ రాజేంద్రప్రసాద్ భారత రిపబ్లిక్ ప్రథమాధ్యక్షుడుగా ఎన్నిక అవడం నిశ్చయం అని ఇండియన్ న్యూస్ క్రానికల్ ఈవేళ వ్రాసింది. ఎన్నిక ఏకగ్రీవంగా జరుగుతుందని కూడా తెలుస్తున్నది.

గతరాత్రి సర్దార్ వల్లభాయ్ పటేలు నివాసంలో, 15 మంది పరిషత్సభ్యులను వివిధ దృక్పథాలవారిని సమావేశపరచి, ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ సర్దార్ వల్లభాయ్ పటేలుగారలు అధ్యక్షుని ఎన్నిక విషయమై సంప్రతింపులు జరిపిరి. ఈ సమావేశం సర్దార్ పటేలు అధ్వర్యమున జరిగింది. ఈ సమావేశ ఫలితంగా పై విషయం తేలిందనీ, సభ్యులలో ఇంచుమించు అందరూ రాజేంద్రప్రసాద్‌నే ఎన్నుకోవాలని అభిప్రాయపడ్డారనీ, ఎన్నిక ఏకగ్రీవంగా జరగాలనికూడా వారి అభిప్రాయమై ఉన్నదనీ, ఆ పత్రిక వ్రాసింది.

రాజ్యాంగ పరిషత్తు కాంగ్రెసుపార్టీ జనవరి 23 వ తేదీన సమావేశం అయి ఈ విషయమును అంతిమంగా నిర్ణయిస్తుంది; జనవరి 24 న పరిషత్తు సమావేశమై అధ్యక్షుణ్ణి ఎన్నుకొంటుంది.

## జార్జిరాజు భారతగవర్నర్ జనరల్ క్రిస్మస్ అభినందనలు

న్యూఢిల్లీ, డిసెంబర్ 25: క్రిస్మస్ సందర్భంలో భారత గవర్నర్ జనరలు, జార్జి రాజు పరస్పర అభినందన సందేశాలను పంపుకున్నారు.

భారత గవర్నర్ జనరలు 23 తేదీన జార్జి రాజుకి ఈ క్రింది సందేశాన్ని పంపారు.

క్రిస్మస్, నూత్న సంవత్సర సందర్భాలలో మీకు, భారత ప్రజల యొక్కనా యొక్క శుభాకాంక్షలను తెలుపుతున్నాను."

జార్జి రాజు 24 వ తేదీన గవర్నర్ జనరలుకి సందేశం పంపారు.

### సిరియా కొత్తప్రభుత్వం

డమాస్కస్, డిసెంబర్ 24: నాజిం ఎల్ కోడ్సీ సిరియాలో నూతన మంత్రివర్గాన్ని యీరాత్రి నిర్మించాడు. ఈయన మొన్న సైనిక తిరుగుబాటు మూలంగా కూలిపోయిన ప్రభుత్వం విదేశాంగమంత్రిగా పనిచేశాడు. ఈ ప్రభుత్వంలో ప్రధానిగా ఉన్నప్పటికీ యీయన విదేశాంగశాఖను తనక్రిందే అట్టిపెట్టుకొంటాడు. క్రొత్త మంత్రివర్గంలో సాబ్ పార్టీవారు అరుగురు, ముస్లిం సోషలిస్టుపార్టీ తరఫున ఒకరు, స్వతంత్రులు యిద్దరు ఉన్నారు.

## స్వతంత్ర ఇండొనీషియా అవతరణ సన్నాహాలు

### తరతరాలనుంచి వస్తున్న డచ్చి సామ్రాజ్యాధిపత్యానికి నేటితో స్వస్తి

జోగ్జకార్టా (బటేవియా) డిసెంబరు 26: చిన్నవిగాని పెద్దవిగాని అన్నీ కలిసి 2,500 లంకలు గల ఇండొనీషియా ద్వీపసమూహము రేపు డిసెంబరు 27 వ తేదీని అచటి కాలమానప్రకారం సాయంకాలము 5 గంటలకు ఐక్య యిండొనీషియా రిపబ్లిక్ అవతరింపనున్నది. ఐక్యరాజ్య సమితిద్వారా ప్రకటితమైన అఖిలప్రపంచ రాజ్యాల శుభాశీస్సులతో స్వాతంత్ర్యమును ఇండొనీషియా నాయకవర్గము స్వీకరించును. అనేక శతాబ్దములనుండి ఇండొనీషియాను పరిపాలించుచున్న డచ్చివారు రేపు తమ అధికారమును విడనాడుకొని క్రొత్త వ్యవహార సంబంధములను స్వతంత్రఇండొనీషియాతో కల్పించుకొనుచున్నారు.

డచ్చివారి తోడ్పాటుతోను సహకారముతోను ఇండొనీషియా ఇకముందు తన దేశములోని వస్తుసంపదను వృద్ధిచేసికొని సుభిక్షము కానున్నది.

ఇండొనీషియా సమస్యను గూర్చి చర్చించుటకై గత జనవరిమాసంలో ఢిల్లీలో జరిగిన సభకు 17 రాజ్యాలవారు హాజరైయుండిరి. రేపు జరుగనున్న స్వాతంత్ర్యోత్సవమునకు ఆ 17 రాజ్యాల ప్రభుత్వములు ఆహ్వానింపబడును. ఆఫ్గనిస్థాను, బర్మా, యీజిప్టు, పాకిస్తాను, సయాము ఫిలిప్పయిన్సు ప్రభుత్వముల ప్రతినిధులు విచ్చేసిరి. అనేక ఇతరరాజ్యముల కౌన్సల్సు యిదివరకే జోగ్జకర్తనగరమందు వ్యవహరించుచున్నారు. వీరందరికి ఆహ్వానములు పంపబడినవి.

రేపు సాయంకాలము 5 గంటలకు ఇండొనీషియాలోని డచ్చిగవర్నరు జనరలు నివసించుచున్నటువంటి కొనిన్స్‌ప్లిన్ వద్ద ఆయన భవనముపై నుండెడి డచ్చి ప్రభుత్వపుజెండా క్రిందికి దింపివేయబడును. గవర్నరు జనరలైన డా॥ లోవింగు సలాంఛనముగా జోగ్జకర్త సుల్తానుకు అధికారములను ఒప్పజెప్పును—సరిగ్గా ఆ సమయంలోనే ప్రధాన మంత్రియగు డా॥ హట్టాగారికి స్వతంత్ర పరిపాలనా అధికారపత్రము హాలెండు రాణియగు జూలియానా రాణిచే ఆంస్టర్డామ్ నగరమందు సంతకం చేయబడినది అందజేయబడును. మరునాటి ఉదయముకే మయూరాన్ విమానాశ్రయములో ప్రెసిడెంటు సుకర్నోగారు దిగెదరు.

రిపబ్లికను సేనలు ఆయనకు సాయుధముగా జోహారుచేయును. ఇండొనీషియా ప్రజలకు ప్రెసిడెంటు సుకర్నో స్వాతంత్ర్య ప్రకటన యొకటి చేయును.

1946 జనవరిమాసంలో ప్రెసిడెంటు సుకర్నోగారు బటేవియానుండి జోగ్జకార్టాకు తమ ముఖ్యనగరమును మార్చుకొనిరి. బటేవియాలోడచ్చి సేనలు చేరెను. డచ్చిసేనలుకూడా విశేషముగా బటేవియాలో దింపబడెను. అందువల్ల బటేవియాకు ప్రమాదము కలుగునని జోగ్జకర్టాకు ముఖ్యపట్టణం మార్చబడెను.

మంగళవారము బుధవారము ఇండొనీషియా అంతటను పబ్లికు సెలవుదినములని ప్రకటింపబడెను. క్రిస్మసు సెలవుల తర్వాత యీ సెలవుదినములు వచ్చుటవల్ల బ్యాంకులు వగైరా వ్యాపారసంస్థలు ఈ సెలవుదినములలో తెరువబడి యుండవలెనని వర్తకులు విజ్ఞాపించిరి.

డచ్చి ఉద్యోగులు తమ డచ్చి త్రివర్ణ జెండాను ఎగురవేయకూడదు అని ఉత్తరువు చేయబడెను.

### బటేవియాలో భారతీయులకు అమృతకౌర్ సలహా

బటేవియా, డిసెంబర్ 25: "ఇండొనీషియన్లు మీ సోదరులే. కనుక వారితో అన్యోన్యంగా మెలగండి" అని రాజకుమారి అమృతకౌర్ బటేవియా భారతీయులు యేర్పాటుచేసిన సభలో ప్రసంగిస్తు, ఇండొనీషియాలోని భారతీయులకు సలహా యిచ్చింది. ఇండొనీషియా స్వాతంత్ర్యోత్సవకాలంలో పాల్గొనుటకు భారత ప్రతినిధిగా యీమె యిక్కడకి వచ్చింది. మాతృదేశంలో ఉన్నవారికంటె, మాతృదేశానికి దూరంగా పరాయి ప్రాంతాలలోఉన్న భారతీయులపై ఎక్కువ బాధ్యత ఉన్నదని, వారి ప్రవర్తనపైనే భారతఖండ పేరు ప్రఖ్యాతులు ఆధారపడి ఉన్నవని అమృతకౌర్ అన్నది.

ఐక్య ఇండొనీషియా అధ్యక్షుడైన సోకర్నోకు, ప్రధాని హట్టాకు, భారత ప్రధాని అభినందన లేఖలను యీమె ద్వారా పంపినట్లు తెలియవచ్చింది.

### బటేవియాకు ఏడు రాజ్యాల ప్రతినిధుల రాక

బటేవియా, డిసెంబర్ 25: డచ్చివారినుండి సర్వస్వాతంత్ర్యాధికారాలను మంగళవారంనాడు ఇండొనీషియన్లు కైవశం చేసుకుంటారు. ఆ నాడు జరిగే ఇండొనీషియా స్వాతంత్ర్యోత్సవాలలో పాల్గొనే నిమిత్తం ఏడు రాజ్యాలనుంచి-ఇండియా, పాకిస్తాన్, బర్మా, సయాం, ఆఫ్ఘనిస్థాన్, ఈజిప్టు ఫిలిప్పైన్ల-ప్రతినిధులు యివ్వాళే బటేవియా నగరానికి విచ్చేశారు.

భారత ప్రతినిధులు, అమృతకౌర్ డా॥ సుబ్బరాయన్‌గారలు, విమానం దిగగానే విమానాశ్రయంవద్ద, భారతీయులు వారికి ఘన స్వాగతమిచ్చి పుష్పమాలాలంకృతుల్ని చేశారు.

భారతీయ కౌన్సల్‌గా పనిచేస్తున్న కన్నంపిళ్లె విమానాశ్రయానికివచ్చి భారత ప్రతినిధులనుస్వీకరించారు. భారతవాణిజ్య మండలి అధ్యక్షుడు అజ్రోమల్, హీరాలాల్ గాంధిగారలు, రాజకుమారి అమృతకౌర్ సుబ్బరాయన్‌గారలకు పూలమాలలు వేశారు.

ఇండొనీషియన్ పత్రికలనేకం రాజకుమారి బొమ్మలను, ఆమె జీవితవిశేషాలను మొదటి పేజీలలో ప్రచురించాయి. రాజకుమారి అమృతకౌర్ బటేవియాలోని హోటల్ అండెస్‌లో మకాం పెట్టినది. సుబ్బరాయన్ కౌన్సల్ జనరల్ భవనానికి వెళ్లాడు.

## గంటల పంచాంగం

విరోధి సం॥ పుష్య శు॥ అష్టమి

1949సం॥డిసెం॥ 27 మంగళవారం

మం॥ అష్టమి రా 1-20 ఉ భా రా 9.23

వర్జ్యం ఉ 7-4 కు.

శు॥ నవమి డిసెం॥ 28 బుధవారం

బు॥ నవమి రా 4-4 రేవ రా 12-31 వర్జ్యం

ప 10-57 ల 12.46 కు.

ఆంధ్రపత్రిక

విరోధి సం॥ పుష్య శు॥ అష్టమి

మంగళవారం

## ఆంధ్ర నాయకుల బాధ్యత

ఆంధ్రరాష్ట్ర తాత్కాలిక రాజధాని స్థలనిర్ణయము విషయమై గత వారంరోజులుగా జరుగుచున్న సంప్రతింపులు ఇంతవరకు ఫలప్రదము కాలేదు. గత నవంబరు 11 న రాష్ట్రనిర్మాణము విషయమై కాంగ్రెసుసంఘము చేసినట్లే సర్వజనామోదమును పొందకలిగిన నిర్ణయమును తిరిగి ఇప్పుడు కూడ నాయకులు చేయగలరని ఆశించుటకు ఇంతవరకు ఆధారమేమియు కన్పించుట లేదు. రాజధానీ స్థలనిర్ణయము గురించి అనవసర వాదోపవాదములు ప్రబలుట శోచనీయము. ఈ పరిస్థితికి ఈనిర్ణయము చేయవలసిన నాయకులు అసలు సమస్యను సరియైన దృక్పథముతో పరిశీలింపకపోవుటే కారణము.

ఇపుడు ఏనగరము రాజధానిగ నిర్ణయమైనను, అది తాత్కాలిక రాజధానియే కాగలదను విషయమును అందరూ ఎలాంటి మినహాయింపులూ లేక అంగీకరించుచున్నట్లు కన్పించదు. ఆ విధంగా అంగీకరించిన శ్రీబాగు ఒడంబడిక ప్రసక్తి వచ్చియుండెడిది గాదు. ఆ ఒడంబడిక ప్రకారము రాజధాని ఎన్నుకొను హక్కు రాయలసీమవారికి ఉన్నమాట వాస్తవమే. కాని అది తాత్కాలికపు ఏర్పాటుకు సంబంధించినది గాదు. ఆంధ్రరాష్ట్ర శాశ్వత రాజధానిని, హైకోర్టు ఏర్పాటును నిర్ణయించునపుడే ఈ ఒడంబడిక ప్రస్తావన రావలసియుండును. కాబట్టి ప్రస్తుత రాజధానీ స్థలనిర్ణయం సందర్భంలో శ్రీబాగు ఒడంబడిక ప్రసక్తికి తెచ్చుట అసలు సమస్యను మరుగుపరచుటకే యగును. నాయకులు గాని, తదితరులుగాని తాత్కాలిక రాజధాని నిర్ణయములో ఈ ఒడంబడికను వేరుగ ఉంచుట అవసరము.

రాయలసీమవారుగాని, సర్కారు జిల్లాలకు చెందిన కొందరు నాయకులుగాని ఇపుడు శ్రీబాగు ఒడంబడికను తమ నిర్ణయమునకు సాకుగ తీసుకొనిన వారు మనస్సులో ఒకటి ఉంచుకొని బయటికి మరొకటి చెప్పుచున్నట్లు భావింపవలెను. పైకి "నేము రాజధాని విషయమై జరుగు నిర్ణయము తాత్కాలికమైనదే" అని చెప్పుచు, "అదే స్థిరపడిపోగలదు" అని మనస్సులో తీర్మానించుకొనిరని చెప్పుటకు ఇంతకంటె వేరు నిదర్శనము అవసరము లేదు. ఏటిని బట్టి నాయకుల ప్రకటనలు ప్రజలకు యథార్థ పరిస్థితులను తెలుపుట లేదు.

తాత్కాలిక రాజధానిని నిర్ణయించుటలో ఈవిధముగ శ్రీబాగు ఒడంబడిక ప్రస్తావన అప్రస్తుతమగుచున్నది. శ్రీబాగు ఒడంబడిక అప్రస్తుతమైన ఇక తాత్కాలికరాజధానీ నిర్ణయము అంత కష్టము గాదు. ప్రభుత్వ కార్యస్థానము, రాష్ట్రమునందలి అన్ని ప్రాంతములకూ అందుబాటులో ఉండవలెనను విషయమున అభిప్రాయభేదము లేర్పడుటకు వీలులేదు. విశ్వకళా పరిషత్తు కార్యస్థానము ఒకమూలకు పోయినదని ఆక్షేపించువారు, ప్రభుత్వ కేంద్రమును మరొక మూల స్థాపింపమని కోరజాలరు. అటు విశ్వకళా పరిషత్తునూ, ఇటు ప్రభుత్వమునూ పోషించువారు అన్నింటిని వదులుకొని సన్యసింపమని ఎవ్వరు వాదింపజాలరు.

సర్కారు జిల్లాలు యావదాంధ్రమునకూ ధాన్యాగారమని ప్రసిద్ధి కెక్కినది. ఈ విషయము ఇంతకు పూర్వము ఇతర ప్రాంతములవారికి గ్రహింపుకు రాకపోయినను, ఇటీవలి తుపాను ఫలితముగ నైనను వారు గ్రహించియుందురు. ఇపుడు తాత్కాలిక రాజధాని విషయమై నాయకులు దూరదృష్టి లేని నిర్ణయమును చేసిన నెల్లూరునుండి శ్రీకాకుళము వరకు ఉన్న ప్రజలనేగాక, హైదరాబాదు సంస్థానమునందున్న తెలంగాణా ప్రాంతీయులనుకూడ అసంతృప్తులను చేసినవారగుదురు. సర్కారు — తెలంగాణా జిల్లాలతో మహా తెలంగాణ రాష్ట్ర నిర్మాణమునకు మరొక ఉద్యమమును ప్రోత్సహించిన వారగుదురు. ఇది ఎంతమాత్రము వాంఛనీయము గాదు. రాయలసీమవారింత కాలము తాము ఆంధ్రరాష్ట్రములో చేరమని వాదించుట ఎంత 'నబబో' ఈ ఉద్యమమూ అంత "నబబు"గనే యుండును.

సర్కారు ప్రాంతీయులనుఅసంతృప్తిపరచుట రాష్ట్రభవిష్యత్తు దృష్ట్యానే గాక, శాంతి, భద్రతల సంరక్షణ దృష్ట్యాకూడ ఎంతమాత్రము వాంఛనీయముగాదు. గుంటూరు, కృష్ణా, ఉభయగోదావరి జిల్లాలలో కమ్యూనిస్టు ముప్పు అధికముగ నున్నది. రంగమునకు 300 మైళ్లదూరముననుండి ఈ ప్రమాదమును ఎదుర్కొనుట ప్రజలలో అసంతృప్తి ఏర్పడిన, ఎట్టి ప్రభుత్వమునకు సాధ్యము గాదు. కనుక రాజధానిని నిర్ణయించుటలో నాయకులు రాష్ట్రమును ఎదుర్కొనుసమస్యలనే దృష్టియందుంచుకొనవలెను.

నేడు నిర్ణయమగు స్థలము తాత్కాలిక రాజధానియే కావచ్చును. కాని రాష్ట్ర భవిష్యత్తు విశాలాంధ్రస్థాపన, ఆంధ్రరాష్ట్ర శాశ్వతరాజధాని ఇవియన్నియు నాయకులు నేడుచేయు నిర్ణయముపైననే ఆధారపడి యుండును. ఈ నిర్ణయముచేయు నాయకులపై ఎట్టి గురుతర బాధ్యతలుగలవో లోగడ హెచ్చరించి యుంటిమి. నాయకులు నేడు తాత్కాలిక ప్రయోజనముల నపేక్షించి ఎట్టి అనుచిత నిర్ణయము చేసినను అట్టినిర్ణయము విషాద సంఘటనలకు విష ఫలితములకు దారితీయును.

నాయకులు బహుజన సమ్మతమైన నిర్ణయమునకు రాకలుగుటకు పూర్వం కొన్ని ముఖ్యవిషయములపై ఒక అభిప్రాయమునకు రావలసియుండును. తాత్కాలిక రాజధాని నిర్ణయములో శ్రీబాగు ఒడంబడికకు స్థానములేదు. కేంద్రప్రభుత్వము పదేపదే హెచ్చరించిన కమ్యూనిస్టు ముప్పును ఎదుర్కొని, ప్రస్తుతము అరాచకము నటించుచున్న ప్రాంతములలో శాంతిభద్రతలను నెలకొల్పి ప్రజల సంరక్షించుటకు ప్రభుత్వ కేంద్రము ఆ ప్రాంతమధ్యములోనుండుట యవసరము. తాత్కాలిక రాజధాని రాష్ట్రమునకు కేంద్రమైన స్థలము యగుటవలన ప్రభుత్వమునకు ఉండు సౌకర్యములు అత్యధికము. విశాలాంధ్ర నిర్మాణమునకు ఈప్రాంత నగరము రాజధానియగుట దోహదముచేయును. నాయకులు ముందు ఈ విషయముపై తమ అభిప్రాయములను తెలిపి అనంతరము ఒక నిర్ణయము చేయవలసి యుండును.

నవంబరు 11 వరకు రాష్ట్ర నిర్మాణసమస్య వర్గ రాజకీయములలో పడి నలిగిపోవుచు వచ్చెను. తిరిగి ఇపుడు రాజధానీ సమస్యకూ అదే గతి పట్టినట్లు కన్పించుచున్నది. దీనిని నివారించుట ఆంధ్రుల ప్రతిఒక్కరి బాధ్యత, కర్తవ్యము అయియున్నది.

### కాశ్మీర్‌కు పరిషత్ సభ్యుల ప్రయాణం

న్యూఢిల్లీ, డిసెంబరు 25: భారత ప్రభుత్వ రక్షణశాఖ అధ్వర్యమున 12 మంది రాజ్యాంగ పరిషత్సభ్యులు కాశ్మీర్ వెళ్ళి స్థితిగతులను స్వయంగా తెలుసుకొని వస్తారు; ఈ బృందం కాశ్మీర్‌కు 27 న బయలుదేరివెళ్ళి 29 న ఢిల్లీకి తిరిగి వస్తుంది.

# రాజధానీ స్థలనిర్ణయ సందర్భంలో ఆంధ్ర నాయకులుగమనింపవలసినముఖ్యాంశాలు

## రాష్ట్రక్షేమం, ప్రజలఅభివృద్ధిదృష్ట్యా విజయవాడే ప్రభుత్వ కార్యస్థానం కావడం అవసరం

ఆంధ్రరాష్ట్ర రాజధాని స్థలనిర్ణయం విషయంలో నాయకులు ఒకసమాధానానికి రావడానికివీలుగా విభజనసంఘంలోని ఆంధ్రసభ్యులు మరో 48 గంటలవ్యవధి కోరడం బాగానేవుంది. 1949 నవంబరు 11 వ తేదీన విజయవాడలో కేవలంద్వైవికంగా ప్రాప్తించినఅంధ్రైక్యతవిచ్ఛిన్నం కావడానికి మరోమూడురోజులు వ్యవధి ఏర్పడిందని దీనిపైకొందరు అభిప్రాయాన్ని ప్రకటించడం సహేతుకంగానే ఉన్నట్లు కన్పిస్తుందికూడా. రాష్ట్రరాజధానీ నగరంగావుండేందుకు ఏనగరంలో ఎక్కువసౌకర్యాలు ఉన్నవో ఏ నగరం అందరికీ అనుకూలంగాఉంటుందో అనే విషయంవిచారించు రాకపోవడమే నేడేర్పడిన సంక్షోభపరిస్థితికికారణం అని సమస్యాపరిష్కారానికి గతవారంరోజులుగా తలంట్లుపట్టుకుంటున్న నాయకులైనా అంగీకరించకతప్పదు. ఈ నాయకులు అందరూ ఏ కారణంవల్లగాని, ఏ దృష్టితోగాని ముందుగా ఒక ప్రాంతంపేరు తీర్మానించుకొని మిగతా వారిని అందుకు ఒప్పించడానికే ప్రయత్నిస్తూ ఉన్నందువల్ల, రాష్ట్ర భాగోగులను, అభివృద్ధి అవకాశాలను గమనించకపోవడంవల్ల ఈ స్థలనిర్ణయం ఎప్పటికప్పుడు వాయిదాపడుతూ వస్తున్నది.

### శుష్క వాగ్దానాలు

ఎనకిటీరోజుల్లో జిల్లాబోర్డులకు నిలబడే అభ్యర్థులు ప్రతిపూరూవచ్చి "మీరు నాకు వోటుఇస్తే మీ వూళ్లో ఆస్పత్రి పెట్టిస్తాను. కళాశాలకు వీలులేదుకాని ఒక హైస్కూలు ఏర్పాటుచేస్తాను. మీ వూరికి కావాల్సిన రోడ్లన్నింటినీ వేయిస్తాను. ఇదిగాక ఇంకా మీరు ఏంకావాలంటే అవన్నీ చేయిస్తాం." అని వాగ్దానాలు చేస్తూఉండేవారు. ఇలా వాగ్దానాలు చేసినవారు బోర్డుమెంబర్లు అవుతూ ఉండేవాళ్లు. కాని ఏమీ జరిగేదికాదు. వాగ్దానాలు చేసినప్రకారం అన్నీ చేయిస్తే మళ్ళీ ఎన్నికలప్పుడు ఏ విషయంలో వాగ్దానాలు చేయడం అనేసమస్య వస్తుందిగదా అని, వాటిని కేవలం, ప్రత్యేకంఎన్నికల కోసమే భద్రంగా ఉంచేవాళ్ళు. ఇప్పుడు రాజధాని స్థలనిర్ణయం విషయంలో తెరవెనుక జరుగుతూఉన్న చాణక్యం చూస్తే ఆ రోజులు జ్ఞాపకం వస్తున్నవి. నూతన ఆంధ్రరాష్ట్రానికి మంత్రివర్గంగాక, సింధుఒరిస్సాల నిర్మాణ సందర్భంలో మాదిరే ఒక గవర్నరు, ఆయన కార్యవర్గం ఉంటుందని అంటే ఈ రాజధానీ స్థలనిర్ణయ సమస్య క్షణంలో పరిష్కారమై పోతుంది.

ఈ సమస్య ఇంత క్లిష్టం కావడానికి మన నాయకులు రాబోయే ప్రమాదాలను-అని మండేతికంకణంలా కళ్లల్లోకి చూస్తున్నా - గ్రహించలేక పోవడమే కారణం. ఆంధ్రులు మద్రాసుమీద హక్కు వదులుకుంటే ఆంధ్ర ప్రభుత్వం ఎంత కాలమైనా అక్కడే ఉండేందుకు తమిళ నాయకులు అంగీకరిస్తారని, కనుక హైదరాబాదు వ్యవహారం పరిష్కారమయ్యేవరకు మన ప్రభుత్వ స్థానం మదరాసులోనే ఉంటుంది గనుక రాజధానీ నగరం ప్రసక్తికి రాదని మన నాయకులు, విశ్వసించక పోయినా ఆశించి, ప్రజలను విశ్వసింపజేస్తున్నారు. అందుకు బాగానే ఉందని అనుకున్నారు.

### వివాదానికి హేతువు

ఇంతలో రాష్ట్ర కాంగ్రెస్ సంఘ తీర్మానంపై శ్రీ ప్రకాశం పంతులుగారితో వ్యాఖ్యానం చేశారనీ, మద్రాసు భవిష్యత్తు జనవాక్య నిర్ధారణ ద్వారానే నిర్ణయం కావాలిఉంటుందని రాజ్యాంగపరిషత్తులో అన్నారనీ చెప్పి తమిళకాంగ్రెస్ సంఘ అధ్యక్షుడు కామరాజనాడార్ నవంబరు 20 వ తేదీ ప్రాంతాల్లో రాష్ట్రావతరణ జరిగిన తరువాత ఆంధ్ర ప్రభుత్వం ఒక్క క్షణం కూడా మద్రాసులో ఉండడానికి వీల్లేదని హెచ్చరిస్తూ ఒక ప్రకటన చేశారు. ఆయన అంత ఖండితంగా చెప్పినా, రాష్ట్ర పబ్లిక్ వర్క్సు మంత్రి శ్రీయం. భక్తవత్సలం అనేక పర్యాయములు రెండు ప్రభుత్వాలకు ఒకే నగరం కార్యస్థానం కారాదనీ, రెండురాష్ట్రాలకు ఒకే పట్టణం రాజధాని కావడం పబులుగాదనీ, స్పష్టం చేసినా మన నాయకులు మాత్రం రాజధాని పేరు అంటూ ఏమి చెప్పినా హైదరాబాదు వచ్చేవరకూ ఆంధ్ర ప్రభుత్వం మద్రాసులోనే ఉంటుంది ప్రజలు నమ్ముతూ వచ్చారు. రాష్ట్రంలో రాగానే పూర్వ వదలిపోయిందంటే ఏంచేస్తారన్న వారికి వీరిచ్చిన సమాధానం "దక్షిణాత్యుల" మైనది: "మాకు అనుకూలమైన చోట గుడారాలు వేసుకొని ప్రభుత్వ కార్యాలయాలు అందులో ఉంచుతాము".

వీటన్నింటి వల్లా స్పష్టమవుతున్నదే కమిటీ అంటే మనవారు ఈ సమస్యను సరియైన దృక్పథంతో పరిశీలించలేదనీ ఎప్పటికప్పుడు ఆ తాత్కాలికావసరాలను బట్టి, అవరోధాలను అతిక్రమించడానికి ఏవో సమాధానాలు చెప్పుకుంటూ కాలయాపన చేస్తూవచ్చారని, నూతన ఆంధ్ర రాష్ట్రం ఎదుర్కొనవలసిన బృహత్ సమస్యలను గురించి వీరిలో ఏ ఒక్కరూ కూడా గమనించి ఏ ఒక్కరూ ఇంతకన్నా చక్కగా యోచించలేదని చెప్పక తప్పదు. మాపూర్వ ఉద్యమంలో ప్రభుత్వం ఆలోచించి అయినా వినియోగించక లేదు, ఇంతకంటే ఎక్కువ నిదర్శనం అవసరంలేదు. లేకపోతే తిరుపతిలో స్థలాలున్నవి గనుక ఆ పూరు రాజధాని చేసుకుందాం అని "మాపాక" అయినా అంటారా? కాక పోతే ఏర్పడబోయే ఆంధ్ర ప్రభుత్వ కార్యాలయాలకు సత్రాలుగానే వుంటాయి గనుక ఆ పరిణామాన్ని సార్థకంచేయడానికే వీరు తిరుపతిని సూచించి వుండవచ్చు. తిరుపతే మనగ్రహచారం చాలక రాజధాని అయితే మన వ్యవహారం కేవలం "సత్రం భోజనం; మఠం నిద్ర"లాగా వుంటుంది! మనరాష్ట్ర వ్యవహారాల నిర్వహణ అలాగే వుండాలని ప్రజాభిమతమైతే తిరుపతిని రాజధాని చేసుకోవడానికి అభ్యంతరం వుండనక్కర్లేదు. అంతేగాక తిరుపతి రాజధానిఅయితే మరోక ప్రయోజనం వుంటుంది. అక్కడికి వచ్చేవారికి పుణ్యం పురుషార్థం రెండూ కలిసి వస్తవి, అధవా అధికారుల దర్శనం కాకపోయినా దేవదర్శనం అయినా అవుతుంది.

పోతే అనంతపురం వారు తమ మహా పట్టణంలో పాకలా భవనాలు, ఒక కళాశాల భవనం, ఇతర చోట్ల ఉన్నట్టే సత్రాలు, ప్రభుత్వ కార్యాలయాలను ఏర్పాటుచేయడానికి ఏ కొరతా ఉండదని, ఊరికి 12 మైళ్ల దూరంలో కావలసినంత మంచినీరుందనీ, కనుక అనంతపురం ఆంధ్ర రాజధానికి ఆదర్శప్రాయమైన నగరం అని అంటున్నారు.

### తాత్కాలిక రాజధానికి తగిన స్థలం ఏది?

తిరుపతికి వచ్చే యాత్రికులను వీధుల్లోకి పంపి సత్రాల్లో ప్రభుత్వ కార్యాలయాలు పెట్టడం ఎంత అందంగా ఉంటుందో పాఠశాలలు, విద్యాసంస్థలు మూసి వేసి ఆ భవనాల్లో ప్రభుత్వ కార్యాలయాలు ఏర్పాటుచేయడం అంత సబబుగానూ ఉంటుంది. ఊరుకు 12 మైళ్లల్లో నుంచినీరుందంటే, ఊళ్లోనే మంచి నీరున్న ఊళ్లు అనేకం లేవా? ఈ వాదనలన్నింటినీ పరిశీలించితే స్వల్పకృమయ్యే విషయం మరొకటి ఉంది. ఈ తాత్కాలిక రాజధాని స్థిరంచేసుకోవడానికి కూడా ప్రయత్నాలు జరుగుతూ ఉన్నవని గ్రహింపకతప్పదు. మన అదృష్టం బాగుండి హైదరాబాద్ మనకు వస్తే అప్పుడే రాజధానిని అక్కడికి మార్చడానికూడా వీరు సమ్మతించే టట్లు కన్పించలేదు ఇదిచాలా ప్రమాదకర విషయం. అయితే వీరు అప్పుడు అడ్డుపడినా ఆగదని వాదిస్తే, 'నందోరాజాభవిష్యతి' అనిమాత్రం సమాధానం చెప్పవచ్చు. అంతేగాదు. నేడు రాజధానిగా నిర్ణయమై నప్పట్నుంచీ ఆయిదేళ్ళలో పదేళ్లలో మరోప్రాంతానికి మారేలోపున ప్రభుత్వావసరాలకు అనేక భవనాలను నిర్మించుకోవలసి వస్తుంది. అనేక ఇతర సదుపాయాలు చేసుకోవలసి వస్తుంది. రాజధాని పూరోకచోటుకు మారడంవల్ల ఇవన్నీ వృధాఅవుతవి. వీటికై ఖర్చు అంతా బూడిదలోపోసిన పన్నీరవుతుంది. కనుక ఉత్తరోత్తరా కూడా ఉపయోగపడగలిగేటట్లు ఆప్రాంతాభివృద్ధికి అవకాశం ఉండేటట్లు చూసుకోవలసి వస్తుంది. ఈ విధంగా సమగ్ర విచారణ జరిపితే విజయవాడే ఆంధ్రరాష్ట్రరాజధానికి అన్నివిధాలా తగిన స్థలం అనినిర్ణయించక తప్పదు.

విజయవాడలో భవనాలకొరతే లేదు. సత్రాలుగానీ, పాఠశాలలుకాని ప్రభుత్వం ఆక్రమించుకోవలసిన అవసరం ఉండదు. ప్రస్తుతం అక్కడఉన్న కొన్ని ప్రభుత్వ కార్యాలయాలను గుంటూరు ఏలూరు, గుడివాడ, బందరులకు మార్చవచ్చును. సందేహం ఉంటే స్థల నిర్ణయంకోసరం ఇక్కడ కాలయాపనచేస్తూ ఉండేవారు ఒక ఇంజనీరుతో వెళ్ళి స్వయంగా విచారించి రావచ్చును.

### విజయవాడ రాజధాని అయితే ఉన్న లాభాలు

విజయవాడలో రాజధాని ఏర్పాటైతే ప్రభుత్వానికి గల మరో అవకాశం, మిత్రులు విశేషం పర్యటన చేయవలసిన అవసరంలేకనే రేడియో కేంద్రంద్వారా యావదాంధ్ర ప్రజలతో నిత్య సంబంధాలను పెట్టుకోవచ్చును. ప్రభుత్వం ఏంచేస్తున్నదో ఏరోజు కారోజు ప్రజలకు తెలపవచ్చును. తిరుపతి, అయినా, అనంతపురం అయినా, మచిలీపురం అయినా ఈ సౌకర్యం ఆ ముంబాయి అనుకోవద్దవరకూ ఉండదు. మంత్రుల పర్యటనల సందర్భంలో మరోకవిషయంకూడా ఉంది. విజయవాడ యావదాంధ్రానికి కేంద్రంగా ఉన్నందువల్ల మంత్రుల ప్రయాణపు ఖర్చులు ఎక్కువకావు. అన్ని ప్రాంతాలకూ అందుబాటులున్నట్లు ఉంటుంది. ఏ జిల్లా తక్కువవస్తుందనే అభ్యంతరం లేకపోతే మంత్రులు కాబోయేవారందరికీ విజయవాడ రాజధాని కావడానికి ఎలాంటి అభ్యంతరమూ ఉండనవసరం లేదు.

రాష్ట్ర రాజధానీ విషయంలో విచారించవలసిన మరొకసంగతి. ముఖ్యంగా కృష్ణా, గుంటూరు, గోదావరి జిల్లాల్లోనూ, సంశ్లిష్ట హైదరాబాద్ సంస్థాన ప్రాంతాల్లోనూ నానాటికీ ప్రబలమవుతూన్న అరాచక చర్యలు తిరుపతిలో రాజధాని పెట్టుకొని వెంకటేశ్వరుని పై భారంవేసి మనం రాష్ట్రంలో శాంతిని నెలకొల్పలేము. అలాగే అనంతపురంలో "మంచినీళ్ళు" త్రాగుతూకూర్చొని ఈ అరాచకచర్యలను అణచలేము. ప్రభుత్వకేంద్రం విజయవాడలోవుంటే ఈ ప్రాంతపుప్రజలకు ధైర్యంకలిగి అరాచకచర్యలను అణచివేయుటలో ప్రభుత్వానికి ఎక్కువగా తోడ్పడగలుగుతారు. ప్రభుత్వంకూడా స్వయంగానే ఈ కార్యక్రమాన్ని నడుపుతూ వుండవచ్చు.

### తెలంగాణాను గమనించాలి

హైదరాబాదును ఏనాటికైనా ఆంధ్ర రాజధానిగా సంపాదించడానికి తెలంగాణాతో ఆంధ్రనాయకులకు ప్రభుత్వానికి ఎక్కువసంపర్కంవుండి ఆ నాయకుల ఉద్యమానికి దోహదంఇస్తూఉండాలి. అలాగాక ఎక్కడో ఒకమూల ఆంధ్రరాజధాని ఏర్పడితే తెలంగాణావారున్నూ విశాలాంధ్ర ఉద్యమంపట్ల ఉత్సాహం లేక విశ్వకళాపరిషత్తు విషయంలో రాయలసీమవారనుసరించిన వైఖరినే అనుసరించి ఇప్పుడున్నట్లే ఉంటం మంచిదని తీర్మానించుకోవచ్చును. అందుకు ఇప్పట్నుంచీ వారిని ప్రోత్సహించేవారులేక పోలేదు. తాత్కాలిక రాజధాని విజయవాడ కాకపోయినట్లయితే విశాలాంధ్రనిర్మాణం ఎప్పటికీ గగనకుసుమంగా ఆశించదగ్గలక్ష్యంగామాత్రమే ఉండిపోగలదు. ఈ నాడు తిరుపతినిగాని, అనంతపురమునుగాని రాజధానిగా నిర్ణయించువారు విశాలాంధ్ర నిర్మాణోద్యమానికి ద్రోహం చేసినవారవుతారు. హైదరాబాద్ ఆంధ్రరాజధాని అగుటకుగల అవకాశాన్ని పూర్తిగా ధ్వంసం చేసినవారవుతారు.

ఇంక విజయవాడను రాజధాని నిర్ణయించుకొనవలసి యుండుటకు మరొక కారణంకూడా ఉంది. మద్రాసును వదులుకొన్న తరువాత విశాఖపట్నమే మనకు రేవు. దాని యభివృద్ధి హెచ్చుగ రాజధానిపై ఆధారపడియుండును. విజయవాడ రాజధాని అయిన ఆ రేవు అభివృద్ధి త్వరగ జరుగుటకవకాశ ముగలదు.

యావదాంధ్రకు ఒక్క విజయవాడ సమీపంలోనే చక్కని విమానాశ్రయం ఉంది. విశాఖపట్నం వదిలివేస్తే, కేంద్రప్రభుత్వం ఈ గన్నవరం విమానాశ్రయాన్ని ఎత్తివేయడానికి ఆలోచిస్తున్నట్లు ఈ మధ్యనే వార్తలు ప్రచారమైనవి. విజయవాడ రాజధాని అయితే గన్నవరం విమానాశ్రయం స్థిరపడిపోవుటే కాద్వారా హైదరాబాద్‌కూ మనకుగల సంబంధాలు ఇంకా సన్నిహితమౌతవి. వేరొకస్థలం రాజధానిగ నాయకులు నిర్ణయిస్తే ఈ అవకాశము పోతుంది!

ఇప్పుడు రాజధానీ స్థల నిర్ణయము చేయునాయకులు ప్రధానపదవిపైగాక రాష్ట్ర అభివృద్ధిపై మనస్సుంచి సర్వజన సమ్మతముకాకపోయినను బహుజన సమ్మతమైన నిర్ణయమును చేయవలసియుండును. విశాఖపట్నంజిల్లాలు, హైదరాబాద్‌లోని తెలంగాణాప్రాంతాలను మనస్సులో వుంచుకొని నాయకులు నిర్ణయము చేసిన విజయవాడే రాజధానికాగలదు. నాయకులు వేరుగ నిర్ణయించిన, అందుకు వారికి రాష్ట్ర అభివృద్ధిగాక అన్యవిషయములు ప్రధానములు, అవసరములు అయియున్నవని ప్రజలు భావించిన తప్పుకాజాలదు.

—ఒక ఆంధ్రుడు.

## 'రాజధాని ఆంధ్రులందరికీ అందుబాటులో ఉండవలెను'

### విభజనసంఘ ఆంధ్రసభ్యులకు విజయవాడ పౌరసభ విజ్ఞప్తి

విజయవాడ, డిసెంబరు 25: "నేటి ఉదయము ఆంధ్రపత్రికలో, రాజధాని విషయమై సత్వర నిర్ణయమునకు రావలసినదిగా విభజనసంఘములోని ఆంధ్రులకు తమిళులు ఒత్తిడి చేయుచున్నటుల ప్రకటింపబడినది. నిర్ణయములను చేయవలసినది మననాయకులు. కొన్నిమన నాయకులు, ప్రజల అభిప్రాయములను కనిపెట్టి ముఖ్య నిర్ణయములను చేయుట్యమించిరి. ఆంధ్రేతర సభ్యుల పట్టుదలకు తలయొగ్గక, యావదాంధ్రులకును అందుబాటులో నుండు కేంద్రస్థానమును, చక్కగా ఆలోచించి రాజధాని నగరముగా నిర్ణయించుట హితకరము" అనినేటిసాయంత్రము విజయవాడ పౌరులు దోర్బల శేషాద్రిశాస్త్రి గారి అధ్యక్షతన రామమోహన్‌హాల్‌వద్ద సమావేశమై, ఏకగ్రీవముగా తీర్మానించిరి.

కోడూరి లక్ష్మీపతిగారు తీర్మానమును ప్రవేశపెట్టుచూ, విభజన సంఘములోని ఆంధ్రసభ్యులు చాలా తికమకలు పడుచున్నట్లున్నదనిరి. మన మంత్రుల యంతటి తెలివితక్కువవారు మరిఉండబోరు అని, మన పుల్లారెడ్డిగారు చాలా బలహీనుల వలెనున్నారని, హెచ్. వి. ఆర్. అయ్యంగారికి గట్టిగట్టి సమాధానము నిచ్చుటను రెడ్డిగారు నేర్చుకొనవలెనని అని హెచ్చరించుచు లక్ష్మీపతిగారిట్లనిరి. బులుసుసాంబమూర్తిగారి ధర్మమా అని చెన్నపురిలో ఈనాటి వరకూ ఆంధ్ర చిహ్నములు నిలచియున్నవి. అయినప్పటికిని,మనము చెన్నపట్నమును వదలివేయ నిశ్చయించినాము. శ్రోత్రరాజధాని నగరమును చూచుకొనవలెను. ఈవిషయములో రాయలసీమ సోదరులు అడ్డంకులు పెట్టుచున్నటుల తెలియుచున్నది. ఆంధ్ర విశ్వ విద్యాలయములో వీరికి ఉచితప్రాతినిధ్యమంతయునూ ఇచ్చినప్పటికిని, అదివాల్తేరులో ఉన్నదనుసెపముతో,వీరు విశ్వవిద్యాలయములో చేరకుండెగనే పట్టుదలగా నుండ నిశ్చయించిరి. ఆంధ్రజిల్లాలు అభివృద్ధిలేక ఉంటున్నవని, మనకు రాష్ట్రము కావలెననుచున్నాము జనకపట్టె జిల్లాలు రాయలసీమ. కానివారు సౌహార్దతను నేర్చుకొనవలెను.

ఘంటసాల సీతారామశర్మగారు, మన నాయకుల రాజకీయములు పురస్కరించుకొని మన అధికారాలను తిప్పవట్టుట నుంచిదికాదనిరి. పుల్లారెడ్డిగారు మంత్రులు చెప్పినట్లు వ్యవహరింపరు. మన రాజధాని మనచేతులలోనే ఉండునుకొన, ముందు రాష్ట్రమును ఏదియో రొకరిముగా జనవరి 26 లోగా సంపాదించి, తరువాత మనమే మనమే సర్దుకొనుట మంచిది. ఈలోగా విభజనసంఘములో పోట్లాడుకొని నవ్వులపాలగుటను అనిరి. వల్లపల్లి అప్పారావుగారు, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసువారు నాయకత్రయమని పేరకను అంగీకరింప సమావేశమైనవారు, వెంటనే గవర్నర్-జనరల్ గారు రాష్ట్రమును ఏర్పరచెదరని వాగ్దానము చేసిరనియు, కాని ఆ వాగ్దానములు అసత్యములయిపోయినవనియు అనిరి. ఇప్పటికైనను, మనము ఊరకున్నచో, జనవరి 26 నాటికి రాష్ట్రము రావచ్చునని ఆశగానున్నది. రాజధాని విషయములోకూడా అట్లే కిక్కురుమనకుండగా, విభజనసంఘమునకు వదలివేయుట వివేకవంతముగా నుండుననిరి. 'దంటు శ్రీనివాసశర్మగారు మాట్లాడుచూ, మనకు హైదరాబాదు రాజధాని అగునని కొందరు ఊరడించుట హాస్యాస్పదముగానున్నదనిరి. హైదరాబాదు సమస్య ఇప్పట్లో తేలదు. కాన మనకు ప్రస్తుతము మంచి రాజధాని నగరమవసరము. తిరుపతిలో రాజధాని నేర్పాటుచేయవలెనని కొందరు చెప్పుచున్నారు. ఈ రాజకీయ మంతనములతో, వెంకటేశ్వర పవిత్ర సన్నిధిని కలుషితము చేయదలపెట్టుట భావ్యముగా లేదు. పైగా అది కేంద్రస్థానము కాదు. ఏలూరువరకు ఒరిస్సాలో చేరిపోయినచో తిరుపతి మనకు కేంద్రస్థానము కాగలదు. దక్షిణ ఆఫ్రికాలో భారతీయులకు సహాయము చేయలేకపోతిమి. కాంగ్రెసు ప్రభుత్వముచే పాలింపబడుచున్న బరంపురంలో ఆంధ్రుల కష్టములను తీర్చలేకపోతిమి. రేపు చెన్నపురిలోని ఆంధ్రులకు కూడా మన మే సహాయము చేయజాలకపోదు మనుటసత్యము, అనిరి. శర్మగారు మాట్లాడుచుండగా "కాంగ్రెసువారు రాజధాని విషయమై నిర్ణయము చేయబోవుచుండగా, ఇతరులు జోక్యము పుచ్చుకొని శల్యసారధ్యము చేయవలపెట్టరాదు" అని గ్రాసి పున్నయ్య కరపత్రము అక్కడ పంచబడగా దానిని సభవారికి చూపుచు, "ఈ సభలో మంత్రి పదవులకు, పర్మిట్లకు తాపత్రయపడువారు ఎవ్వరూ లేరు. ప్రధాని పదవికై ఆతురతను చూపువారికి ఇచట నున్నవారు ఎవ్వరినూ శల్యసారధ్యము చేయరని హామీ నిచ్చుచున్నాను. కాని మా అభిప్రాయములను సలిపుచ్చుటకు మాకు హక్కున్నది. అందులో కాంగ్రెసువారు జోక్యము పుచ్చుకొనరాదు" అని హెచ్చరించిరి. పాటిబండ సుందరరావుగారు మన తాత్కాలిక రాజధానిగా చెన్నపట్నమే వుండవలెననియూ, ఇచ్చనే అడిగినంతనే ఖాళీచేయ వీలుకాని ఈ రోజులలో, రాజధాని ఖాళీచేయవలసినదని పట్టుదల పట్టట తప్పనియూ చెప్పిరి. వెల్లటూరి కోటేశ్వరరావు, కొంకి మళ్ళ నాగభూషణరావు, డా॥ చాగంటి సూర్యనారాయణమూర్తిగారలు, తీర్మానమును ఆమోదించుచూ ప్రసంగముగా మాట్లాడిరి.

తీర్మానము ఏకగ్రీవముగా ఆమోదింపబడెను.

## హైదరాబాదు ఎల్లలో కమ్యూనిస్టుల గొడవ

### చెన్నపట్నంలో వివిధ రాష్ట్రాల ఉన్నతోద్యోగుల సమావేశం

విజయవాడ, డిసెంబరు 26: కేంద్ర ప్రభుత్వ, చెన్నరాష్ట్ర, మధ్య పరగణాల రాష్ట్ర, హైదరాబాదు సంస్థాన ప్రభుత్వాల ఉన్నతోద్యోగుల సమావేశమొకటి ఈ నెల 29-న చెన్నపట్నం పోర్టు సెయింటు జార్జి కోటలో జరుగుతుందని తెలిసింది. ఇందులో హైదరాబాదు ప్రభుత్వం తరఫున ప్రధాని ఎం. కె. వెల్లోడి పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్ ఎస్. ఎస్. జె. ట్రెన్చ్, చెన్నరాష్ట్ర ప్రభుత్వం తరఫున ప్రధాన కార్యదర్శి రామున్ని మీనన్, పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్ జె. దేవసహాయం, ఎస్. ఎ. పి. స్పెషల్ ఆఫీసర్ డి. ఎల్. బర్కెల్ ఉత్తరప్రాంతి డి. జి. జ. వి. జర్. రాజరత్నం పాల్గొంటారు. కమ్యూనిస్టు దుండగాలను అరికట్టడం పరిస్థుటులు, దీవులు మొదలైన వాటినిగురించి చర్చిస్తారని తెలిసింది.

# "వ్యక్తిసంస్కరణపై మన కృషిని కేంద్రీకరించాలి"

## ప్రపంచశాంతివాదులసభలో డా॥ రాజేంద్రప్రసాద్ ఉద్బోధ

సేవాగ్రామ్, డిసెంబరు 25: డాక్టరు రాజేంద్రప్రసాద్ ఈ వేళ ప్రపంచ శాంతివాదులసభలో ప్రసంగిస్తూ వ్యక్తిసంస్కరణపై మన ప్రయత్నం అంతా కేంద్రీకరించాలనీ, వ్యక్తిద్వారానే ప్రపంచ సమస్యల పరిష్కారం జరగవలసి ఉన్నదనీ చెప్పారు.

ప్రపంచ శాంతివాదుల బహిరంగ సమావేశంలో ఉపన్యసిస్తూ డాక్టరు రాజేంద్రప్రసాద్ ఇల్లాగ అన్నారు. "ఈ ప్రపంచ శాంతివాదుల సమావేశంవల్ల ప్రపంచంలో ప్రభుత్వాల నడవడికలో అంతగా మార్పు రాకపోవచ్చును. కాని ఈ సమావేశం వ్యక్తుల జీవితంలో మార్పులు తీసుకురాగలదనీ, తద్వారా వారి ప్రవర్తనలో కూడా మార్పు రాగలదనీ భావిస్తున్నాను. వ్యక్తుల సమూహమే ఒక దేశము. మన ప్రయత్నాలు ఫలించడానికి చాలాకాలం పట్టవచ్చును. మన పనికూడా చాలా దుష్కరమైనది కావచ్చును. కాని మన ప్రయత్నంవల్ల సుస్థిరమైన ప్రపంచశాంతి ఏర్పడగలదు. మన ప్రయత్నాలన్నీ వ్యక్తులమీదనే కేంద్రీకరించాలి. వ్యక్తుల సంస్కరణలకే మనం పూనుకోవాలి. వ్యక్తిని మనం శాంతికి సాధనంగా తయారు చెయ్యాలి," అనికూడా రాజేన్‌బాబు ఉద్బోధించారు.

"ఆ వ్యక్తిద్వారా ఇతరులుకూడా మారేటట్లు తద్వారా ప్రభుత్వాలుకూడా మారేటట్లు చూడాలి."

శాంతివాదుల బహిరంగ సమావేశం మహాదేవ్‌భాయ్ భవనానికి ఎదురుగా ఉన్న విశాలప్రదేశంలో జరిగింది. దీనికి వార్ధాప్రాంతాలలో పనిచేసే నిర్మాణ కార్యకర్తలతో కలిసి 2 వేలదాకా ప్రేక్షకులువచ్చారు. వేదికమీద 60 మంది విదేశప్రతినిధులు, 30 మంది భారతప్రతినిధులు కూర్చున్నారు.

ఐక్యరాజ్య సమితిలో దక్షిణాఫ్రికా నివాసుల తరఫున వాదించడానికి వెళ్లిన రివరెండ్ మైకేల్ స్కాట్ కూడా కూర్చున్నారు.

సభాసమావేశంలో ఆచార్య వినోబాభావే ప్రారంభోపన్యాసం చదవబడింది. వినోబాభావే అనారోగ్యంవల్ల ఈ సమావేశానికి రాజాలకపోయారు. ప్రారంభోపన్యాసం అయిన తరువాత మహాత్మాగాంధీ సన్నిహిత బాంధవి అయిన కాశీబెన్‌గాంధీ సేవాగ్రామ్ తరఫున అతిథులకు స్వాగతం చెప్పారు. అనంతరం హోరేస్ అలెగ్జాండర్ విదేశ ప్రతినిధులను సమావేశానికి పరిచయం చేశారు. పరిచితులందరికీ కాశీబెన్ ముఖంమీద కుంకుమతిలకాలుంచారు. ఒక్కొక్క ప్రతినిధిని పరిచయంచేసే సమయంలో సభ్యులు కరతాళ ధ్వనులతో హర్షనినాదాలు చేశారు. కాశీబెన్ వారందరికీ చేతితో వడికిన నూలు దండలు బహుమతీ చేశారు.

మధ్యరాష్ట్రాల గవర్నరు మంగళదాస్ పక్వాసా శాంతివాదులందరికీ మధ్యరాష్ట్ర ప్రభుత్వం తరఫున ప్రజలతరఫున స్వాగతవాక్యాలు పలికారు.

ఆ తరవాత మంగళదాస్ పక్వాసా ఇంకా మాట్లాడుతూ, గాంధీజీ మానవసేవద్వారానే ప్రపంచక్షేమం సాధించగలమని విశ్వసించారనీ ప్రపంచశాంతి సాధించాలంటే అది మారణాయుధాల ద్వారా సాధ్యంకాదనీ, ప్రేమద్వారానే ప్రపంచశాంతి సాధ్యమనీ గాంధీజీ విశ్వసించారనీ, సత్యాహింసలను సేవాగ్రామ పరిశోధనాగారంలోనే గాంధీజీ బాగా ఉపయోగించారనీ ప్రపంచ శాంతివాదుల సమావేశం దిగ్విజయంగా కొనసాగాలని తాము కాంక్షిస్తున్నామనీ, ఈ సమావేశంలో కొంత ముందు కార్యక్రమంకూడా నిర్ణయించాలనీ చెప్పారు.

ఆ పిమ్మట రాజేంద్రప్రసాద్ ఉపన్యసించారు.

రాజేంద్రప్రసాద్ తమ ఉపన్యాస ప్రారంభంలో తాము ఈ శాంతిసమావేశం తలపెట్టడానికి కొంత తటపటాయించామనీ, ప్రభుత్వంతోను, ప్రజా సమస్యలతోను, సంబంధం కలిగిన తమవంటి వ్యక్తి ఇలాంటి కార్యభారం తలపెట్టడానికి అర్హత ఉన్నవా లేవా? అని సందేహించడమే దానికి కారణమనీ అన్నారు.

ఆ తర్వాత ఆయన యిలా అన్నారు - "మేము చెప్పేదానిలోను, చేసేదానిలోను, కొంత తేడా ఉన్నదని పైవారికి అనిపించవచ్చును. మహాత్మాగాంధీ ఒక మహావ్యక్తి. ప్రపంచానికీ, మాకూ, ఆయన ఒక మహాసందేశం అందిచ్చారు. ఆయన ఈ ప్రదేశంలో లక్షలాది ప్రజలను తమ కార్య ప్రణాళిక అనుసరించేటట్లు చెయ్యగలిగారు. మేము దుర్బలమైన ఉపకరణాలమే అయినా ఆయన మమ్మల్ని యథోచితంగా తమకు సాధనంగా చేసుకున్నారు. మేము ఆయన ఆదర్శాలన్నీ పూర్తిగా అనుసరించామని చెప్పలేము. ఆయన తలపెట్టిన కార్యక్రమ ప్రణాళికను

మావల్ల చాలావరకు సహాయం లభించింది."

తరవాత, భారతదేశంలో అహింసకు గల పూర్వరంగాన్ని వివరిస్తూ డాక్టరు రాజేంద్ర ప్రసాద్ ఇంకా ఇలాగ అన్నారు."

మా భారతదేశయాత్రలో ఎన్నడూ మేము పరదేశాలపై దండయాత్రలు చేసి ఉండలేదు. అయితే మాలో మేము కలహించి ఉండవచ్చును. పరులుమామీద చేసిన ఆక్రమణలవల్ల మా స్వాతంత్ర్యం కోలుపోయి ఉండవచ్చును. కాని మా చరిత్రలో ఎన్నడూ ఇతరదేశంపై దండయాత్రచేసి ఉండలేదు. దీనికి కారణం లేక పోలేదు. చిరకాలం నుంచి అహింస మా ధర్మంగా ఉండడమే దీనికి కారణము. అహింసా తత్వం ఎక్కువగా పైకివచ్చి ఉండకపోవచ్చును. కాని చిరకాలంనుంచీ, చారిత్రకంగాను, సాంస్కృతికంగాను, అహింసాతత్వం భారతీయులలో ఉండడంవల్లనే వారు మహాత్మాగాంధీ ఆదర్శాలు అంగీకరించి వాటిని ఆచరించగలిగారు. ఈ పూర్వ రంగం మనస్సులో ఉంచుకొని, మా సమస్యలను ప్రపంచంలో ఇతరరాజ్యాల సమస్యలను పరిశీలించవలసిందని కోరుతున్నాను.

మేము ఇప్పుడు ఎన్నో సమస్యలను ఎదుర్కొనవలసివున్నది. ఈ శాంతివాదుల సమావేశం ప్రపంచంలోని ప్రభుత్వాలను ఎంతవరకు మార్చగలదో నాకు తెలియదు. దీనివల్ల ప్రపంచ ప్రభుత్వాలలో ఏవిధమైన మార్పు రాకపోవచ్చును. అధమపక్షం యుద్ధాలకోసం తయారవుతున్న ప్రభుత్వాలు ఈ సమావేశ విషయాలేవీ లక్ష్యపెట్టక పోవచ్చునని అనుకుందాము. కాని ప్రతిప్రభుత్వానికి ప్రజల అంగీకారంకూడా ఉండాలి. నిజంఆలోచిస్తే ప్రజలే ప్రభుత్వం ఎన్నుకొంటారని అనాలి.

ఏ ప్రభుత్వమైనా యుద్ధంతలపెడితే ప్రజలకుగూడా ఆ యుద్ధానికి జవాబుదారీ ఉండితీరింది. అందుచేత శాంతివాదులసమావేశం ప్రభుత్వాలనడవడిని మార్చలేకపోయినా, ఒక దేశంలో ఉన్న ప్రజల అభిప్రాయాలను నడవడికను మార్చగలుగుతుంది."

ఆ పిమ్మట డాక్టరు రాజేంద్ర ప్రసాద్ ఇంకా ఇలాగ అన్నారు. "మహాత్మాగాంధీ మరణించిన తరవాత మాకు మార్గదర్శకులు లేరు. అందుచేత ఈ సమావేశం విషయం పెట్టడానికీ, దీని విషయమై పూర్తిగా పూహించడానికీ కొంత సందేహించాను. కాని మిత్రులు హోరేస్ అలెగ్జాండరు, విదేశాలనుంచి తప్పక ప్రతినిధులు రాగలరని నన్ను ప్రోత్సహించారు. విదేశాలలోని శాంతివాదులకు ఈదేశపరిస్థితులు బాగా తెలుసుననికూడా అలెగ్జాండరు అన్నారు. ఈ విషయాలన్నీ నేనిప్పుడు మీకు చెప్పడానికొక కారణం ఉన్నది. మా దేశంలోను, ఇతర దేశాలలోలాగే సైన్యము పోలీసులు ఉన్నారు. మిగిలిన దేశాల ప్రభుత్వాలలాగే మా ప్రభుత్వము నడుస్తున్నది. అయినప్పటికీ మా మనస్సులలో మేము మహాత్మాగాంధీ ఆదర్శాలను మరిచిపోలేదు. ఆయన మార్గంకూడా మేము విడిచి పెట్టలేదు.

అయితే ఈ దేశంలో ప్రస్తుతం ఏర్పడిన పరిస్థితులన్నిటికీ జవాబుదారి మాదే. మహాత్మాగాంధీ జీవించిఉంటే సైన్యంకూడా ఉపయోగించకుండా రాజ్యం నడిపే విధానం ఆయన మాకు ఆదేశించి ఉండును. కాని ఆయన తరుణంలో అస్తమించడంవల్ల ఆయన తలపెట్టినపని మేము యథాశక్తిగా నిర్వహించవలసి వచ్చింది.

అందుచేత మమ్మల్నీ, మా సైన్యాలను చూచి, తొందరగా అభిప్రాయం ఏర్పరచుకోవద్దనే, మిమ్మల్లను కోరుతున్నాను. నిజంగా భారతదేశం హృదయాంతరాళాల్లో అహింసాతత్వమే ఉన్నది. కేవలం మహాత్మాగాంధీవల్లనే మాకీ అహింసాతత్వం అలవడలేదు. చిరకాలంనించీ మా సంప్రదాయంలో కూడా ఈ అహింసాతత్వం అనుస్యూతంగా వస్తూనే ఉన్నది."

డాక్టరు రాజేన్‌బాబు ఇంకా ఇలాగ అన్నారు." మనం చేయవలసిన పని చాలా కష్టమైనది. ఇది సాధించడానికి కూడా చాలాకాలం పట్టవచ్చును. కాని దానివల్లనే ప్రపంచంలో సుస్థిరమైన శాంతి ఏర్పడగలదు.

మనం వ్యక్తి సంస్కరణకోసం ప్రయత్నించాలి. వ్యక్తిని శాంతికి ఉపకరణంగా మార్చాలి. ఆ వ్యక్తివల్ల ఇతరులు, సంఘము, ప్రభుత్వముకూడా మారేటట్లు చూడాలి. మహాత్మాగాంధీ వ్యక్తిసంస్కరణకు పూనుకున్నారు. ఆఫ్రికాలోను, ఇండియాలోను, అల్లాంటి వ్యక్తులను తయారుచేసి, తద్వారా ఆదర్శసంఘం నిర్మించాలని ఆయన ప్రయత్నించారు. అయితే ఆయన పని అసంపూర్ణంగానే ఉండిపోయింది. మనంఅంతా ఆపని పూర్తి చెయ్యడానికి ప్రయత్నించాలి."

తమ ఉపన్యాసం ముగిస్తూ రాజేంద్రప్రసాద్ ఇంకా ఇల్లాగ అన్నారు. మీరు దూరదేశాలనుంచి వచ్చారనీ, ఈ శాంతి నిర్మాణంకోసం ప్రయత్నిస్తున్నారనీ మా దేశీయులకు తెలుసును. మహాత్మాగాంధి ఆదర్శాలవల్ల ఆకర్షింపబడి మీరిక్కడకి వచ్చారనికూడా మేమెరుగుదుము. అందుచేత మీరందరుకూడా మాకీ విషయంలో దారిచూపించాలని కోరుతున్నాను. మా దేశ ప్రజలీ విషయంలో తాము చెయ్యగలిగినదంతా చేస్తారు. మన ప్రార్థనలకు ఫలితాలు కలగగలవనీ మనంమన ఆశయాలు సాధించగలమనీ ఆశిస్తున్నాను.

సభా ప్రారంభంలో ఆచార్య వినోబాభావే తమ ప్రారంభోపన్యాసంలో అహింస అంటే కేవలం హింసాచర్యల నుండి విరమించడమే కాదనీ, నిర్మాణాత్మకమైన ప్రణాళికలద్వారా మానవజాతికి సహాయం చెయ్యడంకూడాఅహింసా మార్గమేననీ, ప్రపంచంఅంతా మూడవ ప్రపంచ యుద్ధాన్ని గురించి ఆలోచిస్తున్నదనీ, ఈ ఆలోచన చాలా చెడ్డదనీ, మాంసాహారం విసర్జించడంవల్ల భారతదేశం అహింసకు గొప్ప సహాయం చేసిందనీ, భారతీయులందరూ, శాకాహారులు కాకపోయినా, భారతదేశంలో శాకాహారానికి గొప్ప గౌరవం ఉన్నదనీ, అహింసామార్గంలో ఇంకా పరిశోధనలు జరపాలని దీనివల్ల దుర్బలులు కూడా దృఢమనస్కులు కాగలరనీ చెప్పారు.

రాజేంద్ర ప్రసాదు ప్రసంగించిన తరవాత పోలండు ప్రతినిధి జె. జె. బస్కో, చెకోస్లవేకియా ప్రతినిధి కారల్ హుజార్ న్యూజిలెండు ప్రతినిధి ఎ. సి. బారింగ్టను కూడా మాట్లాడారు. వీరి అందరి తరువాత రివరెండు మైకేల్‌స్కాట్ కూడా ప్రసంగించాడు.

# "దేశ ఆర్థికాభివృద్ధికి విదేశీ సహాయం అవసరం"

## విశాఖపట్నంలో ఆర్థికమహాసభ ప్రారంభం: ఆచార్య రంగా ఉద్బోధ

### డా॥ రావ్‌గారి అధ్యక్షోపన్యాసం

వాల్తేరు, డిసెంబరు 26: "ప్రపంచంలో క్రొత్త ఆర్థిక సూత్రాలు, కార్యక్రమాలు ప్రారంభమైనవి. వీటిని దృష్టిలో వుంచుకొని ఆసియా దేశాలకు, ప్రజలకు ఉపయోగకరంగా ఉండగల ఆర్థికసూత్రాలను, అభివృద్ధి ప్రణాళికలను భారతీయ ఆర్థికశాస్త్ర వేత్తలు తయారు చెయ్యాలి." అని ప్రొ॥ ఎన్. జి. రంగా నేడిక్కడ 32 వ భారతీయ ఆర్థికమహాసభకు ప్రారంభోపన్యాసం చేస్తూ విజ్ఞప్తి చేశారు.

ఆయన ఇంకా ఇలాగ ఉపన్యసించారు. "ఆసియా దేశాలుద్యమంగా అభివృద్ధియై ఆసియాలోని నూతన ప్రజాస్వామిక రాజ్యాలకు నిలకడ చిక్కి, ప్రజలకు కాస్తయినా అభివృద్ధి ఆశలు కలిగించవలెనంటే ప్రపంచంలోని ధనిక దేశాలు త్వరత్వరగా ఆసియాకు సహాయం చేయవలసివుంటుంది.

ఇండియావంటిదేశం తన ఆర్థికాభివృద్ధికోసం పాశ్చాత్య ధనస్వాముల దయాదాక్షిణ్యాలమీద ఆధారపడి వుండలేదు. విదేశీ పెట్టుబడి దారులకు ఎక్కువగా హామీలు, వాగ్దానాలు ఇవ్వడం, మనపరిశ్రమల మీద, మన ఆర్థిక జీవితంమీద పాశ్చాత్య ప్రభుత్వాలకు ఎక్కువ ప్రాబల్యాన్ని ఇవ్వడం తెలివితక్కువ అవుతుంది, ఎందువల్లనంటే ఈ విధంగా తిరిగి ఆర్థికంగా పారతంత్ర్యానికి లోబడిపోతాము. ప్రభుత్వాలనుండి ప్రభుత్వాలకు ఋణాలుకూడా, తూర్పుదేశాలు తమ పరిశ్రమలను త్వరగా అభివృద్ధి చేసుకోటానికి తగినంతగా రాబోయే పదేళ్ళలో వచ్చేసూచనలేవీ లేవు.

ఇక మన ఆర్థిక సంపదను మనమే సాధ్యమైనంతవరకూ పెంచుకోవాలి. దీనికిముఖ్యముగా వ్యవసాయాభివృద్ధిని ఒక నిర్ణీత ప్రణాళిక ననుసరించి సాగించాలి. మన వ్యవసాయ ఉత్పత్తిని రెండింతలు, మూడింతలు చేయటానికి వీలయ్యేటట్లుగా వ్యవసాయ ఆర్థికవ్యవస్థను పునర్నిర్మాణం చేయాలి. వ్యవసాయకూలీల రైతులసామర్థ్యమును ఎక్కువ చేయాలి. భూమిని చిన్న చిన్న ముక్కలుగా పంచుకోటంవల్ల వచ్చేనష్టాలను నివారించాలి. ఇప్పటికంటే ఎక్కువభూమికి సంపూర్ణంగా నీటివసతి సౌకర్యాలు ఏర్పడేట్లు చెయ్యాలి.

అయితే ఈ విధమైనమార్పులు, పునర్నిర్మాణంజరగటానికి ముందుమనం వ్యవసాయదారులకు శుభ్రమైనజీవితానికి సరిపడే మారకంధరలను వాగ్దానంచెయ్యాలి. వ్యవసాయకూలీలకు కనీసజీతముచేకాక, ఒకవిధంగా క్షేమంచిజీవన ప్రమాణమును కూడా వాగ్దానం చెయ్యాలి. లేకపోతే యీ మార్పులను మనం తేలేము.

మార్షల్ పథకమునుగూర్చి చెబుతూ రంగాగారిల్లా అన్నారు.

"తాత్కాలికంగా ఉత్పత్తిశక్తి తగ్గిపోయిన దేశాలను అభివృద్ధిచేసి నిలబెట్టడానికే మార్షల్ పథకం ఉద్దేశింపబడింది. ఇది ఆసియా ప్రజలకు పనికిరాదు. అయినప్పటికి ఆసియా దేశాలలోని ఆర్థిక వేత్తలు అమెరికాలోని ఆర్థిక వేత్తలు మార్షల్ పథకాన్ని ఆసియాకు విస్తరించి ప్రజాస్వామిక రాజ్యాలను ప్రోత్సహించటం అమెరికాకే ఏవిధంగా లాభకరం కాగలదో నిరూపించాలి.

ఈ రోజు ప్రపంచంలో ప్రజాస్వామ్యం కావాలనే వారిలోనే తీవ్ర సంఘర్షణ జరుగుతున్నది. కొందరు ప్రజాస్వామ్యాన్ని నియంతృత్వం, హింసద్వారాను, మరికొందరు శాంతియుతమైన గాంధీ మార్గాలద్వారాను స్థాపించాలని ప్రయత్నిస్తున్నారు. అయితే శాంతియుతమైన ప్రజాస్వామ్య వ్యవస్థను విశ్వసించే ఆర్థిక వేత్తలు సంఘజీవితాన్ని విషమయంచేసే ఆర్థిక, జాతీయ వర్గవిభేదాలను నిర్మూలించాలని తమతమ ప్రభుత్వాలకు వచ్చ చెప్పాలి. ఈ విభేదాల నిర్మూలనమే హింసావాదులను ఓడించగలదు."

#### విదేశీ పెట్టుబడి

ఇండియాకు విదేశీయుల పెట్టుబడి అవసరమును గూర్చి ఉద్ఘాటిస్తూ, రంగాగారిల్లా అన్నారు.

"ఇతర దేశాలనుండి యాచిస్తే మనం ఆర్థిక పారతంత్ర్యమునకు లోబడి పోతామేమోనని ఇదివరకు భయపడే వారము కాని ప్రపంచ బాంకినుండి ఋణంతీసుకుంటే మనకు వచ్చే ప్రమాదమేమున్నది? ప్రమాదమే ఉంటే దానినుండి మనమెలాగ తప్పుకోగలము? రాబోయే ద్వైవార్షిక 10, 20 ఏళ్ళలో అంతకంతకు ఎక్కువ యంత్రసామగ్రి, టెక్నికల్ ప్రవీణులను దిగుమతి చేసుకోవలసివస్తుంది. మన వ్యవసాయ జల ప్రాజెక్టులకు, వరద నిరోధపు స్కీములకు, జల విద్యుచ్ఛక్తి, రాకపోకలు మొదలైన వాటి కన్నిటికీ మనకు విదేశీయ యంత్రసామగ్రి అత్యవసరం. ఈ అవసరాన్ని తీర్చుకొనేమార్గమేది? ప్రపంచ బ్యాంకి మనకు వీటన్నిటికీ కావలసిన ధనసహాయం చేస్తుందా? అమెరికా, కెనడా మొదలైన దేశాలనుండి స్వంత ఋణాలను తీసుకోవడం అవసరంకాదా? విదేశీయుల పెట్టుబడినికూడా ఆహ్వానించటం అవసరమని నేను భావిస్తున్నాను. లేకపోతే మన దేశం పారిశ్రామికంగాఅభివృద్ధి కాజాలదు.

కాని అమెరికన్ పెట్టుబడిదారులు, తమ పెట్టుబడికి, నిర్వహణకు, టెక్నికల్ ప్రావీణ్యానికి ప్రపంచంలో చాల పెద్ద మార్కెట్ ఏర్పడిందని గ్రహించారు. అందుచేత ట్రూమన్ అధ్యక్షుడు పేర్కొన్న చతుర్థసూత్రప్రకారం అమెరికన్ పెట్టుబడిని, వారి హక్కులను, లాభాలను అన్నివిధాలా రక్షిస్తామని ఒప్పుకొని అమెరికానుండి పెట్టుబడిని తెచ్చుకోవటం మనకు తప్పదు. అయితే మనప్రభుత్వం విదేశీ పెట్టుబడులను ఒకకంటితో ఎప్పుడూ అప్రమత్తతో కనిపెడుతూనే వుండాలి. మనం విదేశీయుల పెట్టుబడిని నిరాకరించినపక్షంలో మన ఆర్థికవ్యవస్థ అభివృద్ధి చాల ఆలస్యం కాగలదు.

10 లేక 20 ఏళ్లలో మనం స్వయం పోషక స్థాయికి రావలెనంటే మన ఆర్థిక వ్యవస్థలో మహాకారసంఘా లభివృద్ధి కావాలి.

"నిత్యావసర వస్తువులను దిగుమతి చేసుకోవడం మానివేయగలం గాని యంత్ర సామగ్రిని మానలేము. అవి మనకు ప్రధానావసరాలు. ఇంగ్లండు తన స్టెర్లింగు విలువను తగ్గించటంతో కఠినమారక ప్రదేశాలకు ఎగుమతు లెక్కువ చేయటానికి వీలైనది. ఇదే పద్ధతిని మనమూ చేయవచ్చును."

మార్షల్ పథకాన్నిగురించి రంగాగారిలా చెప్పారు.

"అమెరికా తన ప్రజాస్వామ్య సిద్ధాంతాల రక్షణకోసం మార్షల్ పథకాన్ని సృజించి ఎన్నోకోట్ల డాలర్లను ఖర్చు చేస్తున్నది. యుద్ధానంతరం ఏర్పడిన పరిస్థితులనుబట్టి ఆహారోత్పత్తి, పంపకములకు జాతీయ ప్లానింగు దృష్ట్యా కాకుండా అంతర్జాతీయదృష్ట్యా సాగించాలని నవీన రాజకీయవేత్తలందరూ అంగీకరించారు. యుద్ధపూర్వపు అంతర్జాతీయ వ్యాపార సంబంధాలు ఒకదారి తెన్నూ లేక నడిచాయి. అందువల్లనే ఆహారోత్పత్తిని కొన్ని దేశాలలో కంట్రోలు చేయటం, పంటలను నాశనం చెయ్యటం, మిగులు ధాన్యాన్ని చాలా చవుకగా అమ్మి వేయటం జరిగేవి. ఇటువంటి పరిస్థితులను నిరోధించటానికి, ప్రపంచంలో సరియైన తిండిలేని 100 కోట్ల ప్రజలకు ఆహారాన్ని సరఫరా చెయ్యటంకోసం ఆహార, వ్యవసాయ సంఘం ఏర్పడింది.

తిండి ఎక్కువై బాధపడే పాశ్చాత్య దేశాలనుండి తిండితక్కువై బాధపడే ప్రాచ్యరాజ్యాలకు ఆహారపుసరుకులు సులభంగా రాగల మార్గాలను అన్వేషించవలసిన బాధ్యత మనపైనఉన్నది. ఈ పనిని ఆహార వ్యవసాయ సంఘానికి అప్పగిస్తే పుణ్యకాలం కాస్తా గడిచిపోతుంది.

ఈలోగా మార్షల్ పథకాన్ని ప్రాచ్య దేశాలకుకూడా విస్తరించాలని మనం ఒత్తిడి చెయ్యాలి. అప్పుడే పాశ్చాత్యుల మిగులు ఆహారం మనకు చేరగలదు. మిగులుదేశాలు కొరతదేశాల స్థితిని అవకాశం చేసుకుని అధిక లాభాలకు ప్రయత్నించకుండాను, మనుష్యులు తినదగిన ఆహారాన్ని పశువులకు వెయ్యకుండాను ఆపటానికి మనం ప్రయత్నించాలి.

మార్షల్ పథకాన్ని ఆసియాకు విస్తరించటం అమెరికాధర్మం. అయితే మనం ఆట మనం మార్షల్ సహాయంకోసం యాచింపరాదు. మనకు సహాయంచేస్తే అమెరికన్ ప్రజాస్వామ్యానికి, ఆసియా ప్రజాస్వామ్యాలకు కూడా ఎంత ఉభయతారకంగా ఉంటుందో మనంవారికి నిరూపించి చెప్పాలి.

#### డా॥ వి. కె. ఆర్. వి. రావుగారి అధ్యక్షోపన్యాసం

ఆర్థిక మహాసభకు అధ్యక్షత వహించిన డా॥ వి. కె. ఆర్. వి. రావుగారు (ఢిల్లీస్కూల్ ఆఫ్ ఎకనామిక్సు డైరెక్టరు) ఉపన్యసిస్తూ భారతదేశపు ఆర్థికాభివృద్ధికి పంచవర్ష ప్రణాళిక నొకదానిని తయారు చేయటానికై జాతీయపథక నిర్మాణ సంఘము నొకదానిని ఏర్పాటు చేయవలెనని సూచించారు.

"రాష్ట్రాలన్నీ ఈ బాధ్యతను పైన వేసుకుని ముందుకురావాలి. రాష్ట్రాలప్రణాళికలన్నీ పరస్పరం సహకరించటమే గాక కేంద్రపథకములతో కూడా సమన్వయించటానికి తగినవిగా ఉండాలి. ఈ విధంగాచేసే ఇండియా అంతటికీ ఏకైకమైన అభివృద్ధిప్రణాళిక ఒకటి ఏర్పడి ప్రయత్నం సుకర మాతుంది" అనికూడా ఆయనఅన్నారు.

మన ఆర్థికాభివృద్ధికి మన పెట్టుబడుల మీదనే ఆధారపడాలనీ, మన నూత్న ఆర్థిక విధానంలో వాస్తవిక దృక్పథము నవలంబించాలనీ ఉద్ఘాటిస్తూ, "మనకు ఈ దేశంలోగాని అంతర్జాతీయంగా గాని పరిస్థితులు అనుకూలంగా లేకపోవటంచేత శీఘ్రాభివృద్ధికిగాని, ఆర్థిక, సాంఘిక సంస్కరణలకుగాని ఇప్పుడు అవకాశంలేదని మనం గుర్తించాలి." అని డా॥ రావుగారు హెచ్చరించారు.

మనకు కావలసిన పెట్టుబడిధనం, ధనవంతులను ఎక్కువగా మిగిల్చి, ఎక్కువగా పెట్టుబడి పెట్టండి అని ఊరికే ఉద్బోధించినంతమాత్రంలో సమకూరదు. ప్రతి కార్మికుడు చేయగలిగిన ఉత్పత్తి బాగా ఎక్కువచేయుటం ద్వారానే పెట్టుబడి ధనం సమకూరుతుంది.

విదేశీయుల పెట్టుబడిని మనం ఏ విధంగా ఆహ్వానించాలో చెబుతూ డా॥ రావు ఇలాగన్నారు: విదేశీయుల పెట్టుబడిని మనం ఆహ్వానిస్తే మన విదేశాంగ వైఖరి యావత్తూ వారికి అమ్ముడు పోవలసి వస్తుంది. కనుక అది మంచిపని కాదు. అంతకంటే మనం, విదేశీ స్వంత పెట్టుబడిదారులనుండి ఋణాలను నిర్ణీతమైన ప్రాజెక్టులకోసం తీసుకుని, వారికి ప్రోత్సాహకరమైన వడ్డీ నివ్వటం మంచిది. ఇండియాలో నిర్ణీతమైన ప్రాజెక్టులను ఏ విధంగా నిర్వహించాలో తెలిసిన విదేశీయ పెట్టుబడి దారులను మన ప్రభుత్వంతో భాగస్వాములుగా ఉంటానికి ఆహ్వానించాలి.

యుద్ధంలో ఏ విధమైన త్యాగమును, ధైర్యమును ప్రదర్శిస్తామో అటువంటి త్యాగ ధైర్యములను ప్రభుత్వం ప్రజలలో కలిగించాలి. భవిష్యత్తులో మనను పీక్కుతినబోయే దారిద్ర్యమే మన శత్రువు. ప్రస్తుతంలో దారిద్ర్యాన్ని సహించేందుకు సిద్ధపడటమే మన ఆయుధం. ఈ మానసిక వాతావరణాన్ని ప్రజలలో కలిగించాలి.

ప్రభుత్వ ఋణాలకు ప్రజలు ఎగబడేలాగ చెయ్యాలంటే వడ్డీలిరి అధికం చెయ్యాలి మరొక ఉత్తరు మార్గ మేమిటంటే, ప్రభుత్వం తీసుకునే ఋణాలు ఎందుకోసమో ప్రజలకు తెలియదు. వాటికొక నిర్ణీత ఉద్దేశ్యం ఉన్నట్లు వారెరుగరు. అలా కాకుండా ప్రభుత్వం ప్రజలనుండి తీసుకునే ప్రతి ఋణానికి ఒక నిర్ణీతమైన ప్రాజెక్టుతోనో, మహత్తర కార్యంతోనో సంబంధం కలపాలి. అప్పుడు ప్రజలకు తామెందుకీ ఋణాన్ని ఇస్తున్నారో తెలుస్తుంది. ఋణమివ్వడం వల్ల తమకుతిరిగి వడ్డీ రూపేణా లాభం రావడమే గాక దేశాభ్యుదయమునకు తోడ్పడే ఒక నిర్ణీత కార్యంలో తాము కూడా భాగస్వాములమనే ప్రోత్సాహం, ప్రభుత్వం చేసే వ్యయంలోనూ దాని నిర్వహణంలోను వారికి అధికారశక్తి కలుగుతుంది.

ప్రజలవద్ద అదనంగా నిలవ ఉంటే ధనం ప్రభుత్వమునకు చేరటానికి మరొక మార్గంగా పన్నులను అధికం చేయాలి. అది విఫలమైతే నిర్బంధంగా ప్రజలచేత నిలవ చేయించాలి. అధికంగా వేసే పన్నులకు ఒక నిర్ణీత ఉద్దేశ్యం, అభివృద్ధి ప్రణాళిక ఉన్నట్లు, లేకపోతే దేశ ఆదాయంలో మిగులును సృష్టించటానికి ఉద్దేశింపబడినట్లు తెలియ పరచాలి.

మన అభివృద్ధి ప్రణాళికలన్నీ మొట్టమొదటగా యుద్ధానంతర ద్రవ్యోల్బణ స్థితి, రూపాయి విలువ తగ్గింపు, విభజన వల్ల కలిగిన ఆర్థిక ఫలితాలు వీటి నుంచి కోలుకొనేందుకే ప్రయత్నించాలి. తరువాత అసలు అభివృద్ధి సంగతి ఆలోచించుకో వచ్చును. మన పెట్టుబడి నంతటినీ ముందు దీనికోసమే ఉపయోగించాలి.

#### స్వయం పోషకత్వం

విభజన వల్ల మన ఆర్థిక వ్యవస్థ పూర్తిగా తారుమారైనది. ఈ తారుమారును సరి చేయటానికి ప్రభుత్వం అనుసరించవలచిన విధానం నాకు చాలా అశ్చర్యకరంగా ఉన్నది. ప్రతి జనుములోనే గాక ఆహార విషయంలో కూడా మనం స్వయంపోషకం కావాలని, ముఖ్యంగా 1952 కల్లా ఎన్ని ఆవాంతరాలు వచ్చినా మనం ఆహార దిగుమతులు నిలిపివేసుకోవాలని భారత ప్రభుత్వము, ప్రధాని చెబుతున్నారు. ఇది హాస్యాస్పదం. కేవలం ఎందుకూ కొరగాని అవకాశవాదం. ఇండియాలో వ్యవసాయమంటే వర్షాలతో జూదం ఆడటం. కనుక 1952లో కూడా మనం ఆహారం దిగుమతి చేసుకోవలసివస్తే ప్రజల్లో మానసికంగా ఎంత అలజడి, నిరాశ కలుగుతుందో నేనూహించలేను.

అలాగే ప్రతివిషయంలో కూడా, వచ్చే కొద్దిఏళ్ళవరకూ, యుద్ధకాలంలో వలెనే గుడ్డవాడకాన్ని తగ్గించుకోమని చెప్పాలిగాని, మిల్లు పరిశ్రమలు ఏమీ లేకుండానే మనం గుడ్డ ఉత్పత్తిని పెంచగలమని చెప్పటం తెలివితక్కువ. అలాగే పాకిస్థాన్ జనపనార ధరల ఒత్తిడిని మనం ఎదిరించాలంటే తాత్కాలికంగా నైనా జనప పరిశ్రమను మనం నిలిపివేయాలి.

#### ఆర్థిక విధానం

భారతప్రభుత్వపు ప్రస్తుత ఆర్థిక విధానాన్నిగూర్చి చెబుతూ డా॥ రావుగారిల్లా చెప్పారు.

ప్రభుత్వము ఇప్పటికైనా బడ్జెట్ ఖర్చును పెట్టుబడి ఖర్చులను తగ్గించాలని, కంట్రోలు సాధనంద్వారా ధరలను తగ్గించాలని, గుర్తించినందుకు నేను సంతోషిస్తున్నాను. ధాన్యసేకరణయొక్క ప్రాముఖ్యతనుగూడా ఇదివరకు కంటే బాగా గ్రహించినందుకు- నిర్బంధపొదుపు విధానమును ప్రవేశ పెట్టినందుకు, ఎగుమతులెక్కువ చేయాలని, దిగుమతులను తగ్గించాలని గ్రహించినందుకు కూడా సేనుసంతోషిస్తున్నాను.

ధరలను తగ్గించటానికి ఉత్పత్తినధికం చేయుటమే మార్గమని ఇదివరలో ప్రభుత్వం పొరపడినది. ఉత్పత్తి ఇంతకన్నా వృద్ధిలో. ఎంతఅనుకూల పరిస్థితులున్నప్పటికీ పెరగదు. అందులో అనుకూలపరిస్థితులు లేనప్పుడిక చెప్పేదేమిటి? అనుకూలం కాకపోగా ప్రభుత్వపు నిలకడలేని పారిశ్రామికవిధానంవల్ల ప్రతికూలంగానూరన్ని.

ధరలను తగ్గించటానికి ప్రభుత్వం కరెన్సీ నిబంధనలను ప్రయోగించలేరు. పెట్టుబడులను విపరీతంగా ఖర్చుపెట్టారు. బోనసు క్రొత్తపన్నులు వేశారు. వీటివల్ల మనవ్యాపారంమందగించి ధరలుపెరగటం మాత్రమేజరిగింది. ఆర్థికంగా అభివృద్ధి కావాలి సుఖసంపన్నం చెయ్యాలి. అనే ఆదుర్దా కొద్దిపరిశీలనా నాలవలంబించి లోటుబడ్జెటులను వేశారు.

ధరలను తగ్గించటానికి కంట్రోలు సాధనాలను కూడా వారు ఉపయోగించలేదు. ధరలపై కంట్రోలు ఉంచినచోట ధరల పెరుగుదలను అనుమతించారు. కంట్రోలు తీసివేసినచోట ఎటువంటి కాపుదల లేనందున ధరలు విపరీతంగా పెరిగిపోయాయి. జీతాలు, కూలీలు పెరగనిచ్చారు. దీనివల్ల యుద్ధకాలపు స్థాయినుండి ధరలు పడిపోవక పోవటమేకాక మరీ ఎక్కువగా పెరిగాయి.

# ఫ్రెంచి ఇండియాలో ఓటర్లజాబితాలసవరణ

## ఫ్రెంచి ప్రభుత్వానికి ఢిల్లీ అధిక్షేపణ

న్యూఢిల్లీ, డిసెంబరు 25: ఫ్రెంచి భూభాగముల వోటర్ల పట్టికల సవరణలో తటస్థ పర్యవేక్షకులను నియోగించు విషయమై భారత ప్రభుత్వమువారితో ఒడంబడిక చేసికొనకుండా డిసెంబరు 20 తేదీన వోటర్ల పట్టికల సవరణను ప్రారంభించినందులకు భారత ప్రభుత్వమువారు ఫ్రెంచి ప్రభుత్వమునకు యిటీవల ఆక్షేపణ తెలిపిరని భారత యునైటెడ్ ప్రెస్ వారికి నమ్మకముగా తెలియుచున్నది. ఈ ఆక్షేపణకు సమాధానముగా, డిసెంబరు 20 తేదీనుండి 15 రోజులవరకు పాత వోటర్ల పట్టికలను పరిచూచు కార్యకలాపములు సాగునని, దరఖాస్తులు, ఆక్షేపణలు అందినతరువాతనే క్రొత్త వోటర్లను చేర్చెదరని, అప్పటికి రిఫరెండమ్ సందర్భమున నియమింపబడిన పర్యవేక్షకులలో కొందరైనన్నూ వచ్చి వోటర్ల పట్టికల సవరణను అజమాయిషీ చేయుదురని తాము ఆశించుచున్నట్లు ఫ్రెంచి ప్రభుత్వము వారు తెలిపిరని తెలియుచున్నది.

ఈ పర్యవేక్షకులు జనవరి ప్రారంభములో భారతదేశము వచ్చి ఫ్రెంచి భూభాగములలో వోటర్ల పట్టికల సవరణను అజమాయిషీ చేయుదురని ఆశింపబడుచున్నది.

### కస్టమ్సు నిబంధనలవల్ల ఇబ్బందులు

#### భారత ప్రభుత్వ ఉన్నతాధికారి విచారణ

పుదుచ్చేరి, డిసెంబర్ 25:—ద. భారత దేశమునందలి ఫ్రెంచి భూభాగముల సరిహద్దులలో కస్టమ్సు నిబంధనలు యెట్లు పనిచేయుచున్నవో పరిశీలించుటకు భారత ప్రభుత్వ ప్రత్యేక శాఖ ఉన్నతాధికారి యొకడు జనవరి ప్రారంభములో యిచ్చటికి వచ్చునని తెలిసినది.

ఈ నిబంధనలను అమలు చేయుటవల్ల ప్రజలకు చాలా కష్టములు కలుగుచున్నవని అనేక ఫిర్యాదులు వచ్చియుండెను.

# హిందూ మహాసభ మాత్రమే హిందువులను రక్షించగలదట

## కలకత్తా సమావేశాన్ని ప్రారంభిస్తూ కాంగ్రెస్ సంస్థపై సావర్కార్ విమర్శ

కలకత్తా, డిసెంబర్ 25: హిందువులను రక్షించ కలిగేది హిందూమహాసభే అనీ, ప్రతిహిందువూ అందులో చేరాలనీ శ్రీ వి.డి. సావర్కార్ నేడిక్కడ అఖిలభారత హిందూమహాసభ సమావేశానికి ప్రారంభోపన్యాసం చేస్తూ హెచ్చరించారు. ప్రారంభోపన్యాసం నిన్ననే జరగవలసింది కాని మైక్రోఫోను చెడిపోవడంవల్ల సగంలో ఆగిపోయినది.

కాంగ్రెసు వివిధ సమస్యలనూ ఎన్నికల దృక్పథంతో చూస్తున్నదే కాని ప్రజా దృక్పథంతో అంతగా పరిశీలించటంలేదని ఆరోపిస్తూ, హిందూధర్మశాస్త్ర క్రోడీకరణ బిల్లును ప్రస్తుతానికి వాయిదా వేయటం అవసరమని ఆయన హెచ్చరిక చేశాడు.

పాకిస్థాన్ నిర్మాణంవల్ల దేశంలో నాలుగోవంతుకి స్వాతంత్ర్యం రాకుండా పోయినదనీ, భారతప్రజలు బలం సంపాదించుకుని మూడు నాలుగేళ్లలో చీల్చబడిన రాష్ట్రాలను తిరిగీ సంపాదించవలెననీ ఆయన ఉద్ఘాటించాడు.

ఆయన ప్రసంగం ఈ క్రిందివిధంగా ఉన్నది.

హిందూమహాసభ ఒక్కటే హిందువులను కాపాడగలదు. ఇప్పుడు కాంగ్రెసు వైఖరిని నిందించి ప్రయోజనంలేదు. సమాజపు వైఖరే నాయకుల్లో కూడా ప్రతిఫలించింది. కాంగ్రెసువేమిచేయబోతున్నదో హిందూమహాసభ కిందటి ఎన్నికలప్పుడే ప్రజలకు కేటతెల్లంగా వెల్లడించింది. అయినప్పటికీ అత్యధిక సంఖ్యాకులు కాంగ్రెసుకే వోటు చేశారు. ఇప్పుడు పండిత నెహ్రూ ఇట్లా చేస్తున్నాడు, సర్దార్ పటేల్ అట్లా చేస్తున్నాడు అని అడిగే హక్కు వోటర్లకేమున్నది?

హిందూస్థానాన్ని తన వెనకటి స్థితిలో ప్రతిష్ఠించి కాని పురోగమనానికి తోడ్పటమే హిందూమహాసభ ఆదర్శం.

### పాకిస్థాన్ పట్ల ఖండితవైఖరి

పాకిస్థాన్‌తో మనం వ్యవహరించేప్పుడు 'శుక్కకాట్టుకు చెప్పుదెబ్బ' అన్న న్యాయాన్ని అనుసరించాలి. ఆదేశంతో రాజీ పడటానికి వీలులేదు. ఇండియా ప్రజలు తమ ఉనికి బలపరచుకుని మూడు నాలుగు ఏళ్ళలో దేశంలోనుంచి చీల్చబడిన ప్రాంతాలను తిరిగీ సంపాదించవలసి ఉన్నది.

1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య యుద్ధంనాటినుంచీ గడచిన ప్రపంచయుద్ధమువరకూ జరిగిన అనేక పరిణామాలవల్ల మనం స్వాతంత్ర్యంసంపాదించ కలిగాము. స్వాతంత్ర్యం విషయంలో, మనకు ఎటువంటి సందేహమూ ఉండ నవసరంలేదు. దానిని నాజీవితంలో చూడకలిగినందుకు సంతోషిస్తున్నాను.

అయితే పాకిస్థాన్ ఏర్పడటంవల్ల స్వాతంత్ర్యం పరిపూర్ణంగా రాలేదని కొందరు అంటున్నారు. కాని మనం అంతా పోగొట్టుకోలేదని, దేశంలో ముప్పాతిక భాగానికి స్వాతంత్ర్యం సంపాదించుకున్నామనీ వాళ్లు గ్రహించాలి. శత్రువు మనదేశంనుంచీ వెడుతూ చివరి తన్నుగా ఈ పనిని చేసి వెళ్లాడు. శత్రువు ఇంకోవిధంగా చేస్తాడని అనుకోనక్కరలేదు.

పాకిస్థాను గా ఏర్పడిన మూడు రాష్ట్రాలూ మనని శాసించేటట్లయితే ఇక చేయవలసినదల్లా వాటిని తిరిగీ మనం సంపాదించటమే. కాంగ్రెసు ఈ విషయమై తెలివి తెచ్చుకోలేక పోతున్నది కాని ప్రస్తుత పరిస్థితులు దీనిని గ్రహించేట్లు చేయగలవు.

### ప్రస్తుత పరిస్థితి

వెంటనే సవరించబడే చిన్న విషయాలకు ప్రజలు పట్టించుకోకూడదు. బ్లాక్ మార్కెటింగ్ ఎక్కువై పోతున్నదని అంటారు. కాని ప్రజలు తమ హృదయాల మీద చేతులు వేసుకుని తాము దేవతల మోస్తరు ఉన్నామని చెప్పగలరా? ప్రస్తుత పరిస్థితులలో ఏ ప్రభుత్వమయినా ఇంతకన్నా ఏమీ చేయలేదు. ప్రభుత్వ సభ్యులు సమాజంలో సభ్యులు. సమాజం ఎట్లా ఉంటే వారూ ఆ విధంగానే ఉంటారు.

### హిందూ మహాసభ ఆవశ్యకత

ప్రస్తుత రాజకీయ పరిస్థితుల్లో హిందూ మహాసభ ఉండటం అవసరమా అన్న ప్రశ్న వస్తున్నది. అది వెనకటి కంటె కూడా ఎక్కువ అవసరమని నేను ఉద్ఘాటిస్తున్నాను. హిందువులను రక్షించటానికి హిందూ మహాసభ ఉండి తీరవలసిందే, కాంగ్రెసుతో సఖ్యంగా ఉందామనే మేము ప్రయత్నిస్తున్నాము కాని, కాంగ్రెసే దానికి ఇష్టపడలేదు. ఆ ఎత్తులు ప్రయోజనం లేవని గ్రహించి కాంగ్రెసు ఇప్పుడు ముస్లిములను చేరతీద్దామని ప్రయత్నిస్తున్నది. అది హిందువులకు చాలా ప్రమాదకరం.

### కాంగ్రెస్‌పై విమర్శ

కాంగ్రెస్ దేశ వ్యవహారాలను ఎన్నికల దృష్టితో చూస్తున్నట్లుగా ప్రజా దృక్పథంతో పరిశీలించటం లేదు. అధికారాన్ని తమ చేతిలోనే నిలుపుకోవటానికి వారు తాపత్రయ పడుతున్నారు. హిందూ ధర్మ క్రోడీకరణ బిల్లుపై పార్లమెంటులో జరిగిన చర్చలో కాంగ్రెస్ అధ్యక్షుడు మాట్లాడుతూ బిల్లును ప్రస్తుతానికి వాయిదా వేయుమని చెప్పటం దీనికి ఉదాహరణగా తీసుకోవచ్చును. ఆయనకు అది మంచిదిగాతోచి ఎన్నికలు జరిగినా జరక్కపోయినా అవసరమైనని కనుక దానిని ఆమోదించ వలసినదే అని ఆయన స్పష్టంగా ప్రకటించి ఉంటే నేనెంతో సంతోషించి ఉండేవాడిని.

అయితే ఈ వైఖరి బాధ్యత ప్రజలదే. కాంగ్రెసు పాకిస్థాన్ స్థాపనకు ఒప్పుకున్నదనీ, కమ్యూనల్ ఎవార్డు జాతీయైక్యతను నాశనం చేస్తుందనీ, జనాభా లెక్కలను బహిష్కరించటం వల్లతీవ్రప్రమాదం కలుగుతుందనీ హిందూ మహాసభ హెచ్చరించినది. అఖండ హిందుస్థానమే తమ ఆశయంగా భావిస్తున్న హిందూ మహాసభ మాటలను వోటర్లు వినలేదు.

### కార్యసాధనకు క్రమబద్ధ పద్ధతులే

ఆశయాలను సాధించటానికి క్రమబద్ధమైన, న్యాయ బద్ధమైన పద్ధతులనే ప్రజలు ఉపయోగించాలి. న్యాయ నిర్వహణను మన చేతుల్లో తీసుకుని అరాచకంకలిగించకూడదు. అయితే ప్రజలను శత్రువుల బారినుంచి ప్రభుత్వం కాపాడ లేకపోతే వారాపనిని చేయవచ్చును."

ప్రారంభోపన్యాసం అయిన తరవాత అధ్యక్షుడు డా॥ ఎన్. బి. ఖరే అధ్యక్షోపన్యాసం చేశాడు. ఇదిలోగడ ముందుగా ప్రకటించ బడినది.

సమావేశము రేపు కూడా జరుగుతుంది.

## సభాకార్యక్రమానికి మధ్యలో అంతరాయం

కలకత్తా, డిసెంబరు 24: ఈ నేళ అపరాహ్ణం ఇక్కడ ప్రారంభమైన అఖిల భారత హిందూమహాసభ 28వ సమావేశం శబ్ద విపులీకరణ యంత్రములు మధ్యలో చెడిపోవడంవల్ల, అర్థాంతరంగా ఆపివేయవలసి వచ్చింది. వి. డి. సావర్కార్ గారు ప్రారంభోపన్యాసం చేయడానికి లేచినప్పుడే శబ్ద విపులీకరణ యంత్రములు సరిగాలేనట్లు చెప్పడంవల్ల అర్థంఅయింది. వెంటనే వాటిని సరిచేయడానికి ప్రయత్నించారు గాని మళ్ళీ అవి 15 నిముషాలలోనే పూర్తిగా చెడిపోయి ఊరకున్నవి. అంతటితో సమావేశాన్ని నాటికి విరమించవలసి వచ్చింది.

ఆహ్వానసంఘం అప్పుడు సమావేశాన్ని రేపు మధ్యాహ్నం 2 గం. 30 ని. కు వాయిదా వేసినట్లు ప్రకటించింది. ప్రథమ దిన సమావేశం ఆహ్వాన సంఘాధ్యక్షుని ఉపన్యాసానంతరం ఈ విధంగా మధ్యలో ఆగిపోయింది. సావర్కారుగారు తమ ఉపన్యాసాన్ని రేపు తిరిగీ అందుకుంటారు. డా॥ ఎన్. బి. ఖరేగారు లిఖితమైన తమ అధ్యక్షోపన్యాసమును రేపు బహిరంగ సమావేశంలో చదివి వినిపిస్తారు.

దేశం నాలుగు మూలలనుండి ప్రేక్షకులూ ప్రతినిధులూ అంతా కలిసి 10 వేల మంది దాకా సమావేశానికి వచ్చారు. సమావేశం దేశబంధు పార్కులో జరిగింది. ప్రేక్షకులలో అపూర్వమైన ఉత్సాహోద్రేకం గోచరించింది. గడచినసారి హిందూ మహాసభ సమావేశం భాగల్పూర్‌లో జరిగింది. ప్రస్తుతం భారత ప్రభుత్వంలో పారిశ్రామిక శాఖా మంత్రిగా ఉంటున్న డా॥ శ్యామప్రసాద్ ముఖర్జీ గారు ఆ సమావేశానికి అధ్యక్షత వహించిరి.

వేదికపై సమాసీనులైన ప్రతినిధులలో ఈ క్రింది ప్రముఖులు ఉన్నారు:— వి. డి. సావర్కారు, ఎల్. బి. భోపట్కారు, కాప్టెన్ కేశబ్ చందర్, వి. జి. దేశపాండే, మహంత దిగ్విజయనాథ్.

ప్రొద్దున డాక్టర్ ఖరేగారు దేశబంధు పార్కులో సభామంటపమునకు ఎదురుగా హిందూమహాసభ జెండాను ప్రతిష్ఠించారు పతాకనుఆరోహిస్తుండగా వేలకొలది మహాసభ కార్యకర్తలు సానుభూతిపరులూ "వందేమాతరం", "అఖండ భారత్‌కీ జై" చేనే నినాదాలతో దిక్కులు ప్రతిధ్వనింపట్లు చేశారు. పెళపెళలాడే దుస్తులు ధరించిన స్వచ్ఛంద సేవకులు సైనిక మర్యాదగా పతాకవందనం చేశారు. అనంతరం 50 మంది పండితుల శాంత్యావాహవాలతో స్వాధ్యాయమంత్రపఠన పురస్సరంగా 8 గం. సేపు మహాయజ్ఞం జరుపబడినది. సభామంటపం లక్ష చదరపు అడుగుల వైశాల్యం కలిగి కుంకుమరంగు జెండాలతోను లతానికుంజములతోను అలంకరింపబడింది. స్వామీ వివేకానంద, రాజా రామ్‌మోహన్‌రాయ్, నేతాజీ సుభాస్ చంద్రబోస్, శ్రీ అరవిందఘోష్‌గారల చిత్రపటాలుచుట్టూ వ్రేలాడగట్టబడినవి. మహాసభ కేతనం అయిన స్వస్తిక ప్రముఖంగా ప్రదర్శించబడింది.

డా॥ ఎన్. బి. ఖరే, ఎల్. బి. భోపట్కార్ మొదలైన మహాసభ నాయకులతో కలిసి సావర్కార్‌గారు సభామంటపంలో ప్రవేశించినప్పుడు, ప్రేక్షకుల హర్షధ్వానములతో దిక్కులు పిక్కటిల్లినవి. వేదమంత్ర పఠనంతో సమావేశం సాయంత్రం 4 గంటలకు ప్రారంభమైంది. స్వామీ కృష్ణానంద బ్రహ్మచారిగారు శిష్యబృందంతో కలిసి "వందేమాతరం" గీతాగానంచేశారు. బాల్యంలో సావర్కార్‌గారు రచించిన రెండు గీతాలను కూడా పాడారు.

ఆటుపిమ్మట ఆహ్వాన సంఘాధ్యక్షులు ఉపేంద్రనాథ్ బెనర్జీగారు స్వాగతోపన్యాసం చేశారు. కాంగ్రెసు నాయకులు దేశద్రోహం చేశారనీ, దేశవిభజనకు అంగీకరించడం విశ్వాసఘాతుకత్వం తప్ప మరేమీ కాదనీ, ఆయన ఉపన్యాసక్రమంలో ఆరోపణ చేసినప్పుడు సభికులు ఆమోద సూచకంగా సిగ్గు సిగ్గు అని అరచి చప్పట్లు కొట్టారు. భారతమాతను ఖండితుండాలు చేయడానికి ఎన్నటికీ ఒప్పుకోకూడదని, భారతదేశం అఖండమనీ, అవిభాజ్యమనీ ఆయన ఉద్ఘాటించారు.

బ్రహ్మాండమైన హర్షధ్వానములు చెలరేగుతుండగా సావర్కారుగారు లేచి ఈ విధంగా ప్రారంభోపన్యాసం చేశారు:— మన కిప్పుడు లభించిన స్వాతంత్ర్యం తరతరాలకు కూడా తరగని పెన్నిధానం. మన దేశముయొక్క వర్తమాన స్థితి ఎంత అసంతృప్తికరంగా ఎంత లోపభూయిష్ఠంగా ఉన్నప్పటికీ, చిరకాల దాస్యానంతరం దేశం ఇప్పుడు తిరిగి స్వతంత్రమైందన్న విషయం మనం మరువరాదు. మహాయోధుడైన శివాజీ మొగల్ సామ్రాట్టుల చేతిలోనుండి కొంత భాగాన్ని విడిపించి స్వతంత్రం చేశాడు. రాజపుత్రులు హిందూ సామ్రాజ్యాన్ని సంకల్పి కొంతకాలంపాటు నిలిపారు. కాని మనం ప్రస్తుతం సాధించిన స్వాతంత్ర్యం సాటిలేనిది. బలవత్తములైన బ్రిటిష్‌వారిని దేశంలోంచి వెడలనడిపాము. మన దేశంలో ఒక్క బ్రిటిష్ పురుషుడైనా ఇప్పుడు లేడు. మనకు లభించిన ఈ స్వాతంత్ర్యం ఒక్క కాంగ్రెసువారివల్లనో, లేక హిందూ మహాసభవారివల్లనో లేక కేవలం మరణమును వరించిన విప్లవవాదులవల్లనో రాలేదు; ఈ అందరి సమిష్టి ప్రయత్నంవల్లను మనకు ఇదివచ్చింది. చారిత్రకంగాచూస్తే ఇప్పుడు హిందూతత్వమే జయించిందని చెప్పాలి. స్వాతంత్ర్యప్రాప్తి అనంతరం, దేశ పరిపాలనను హిందువులేనడుపుతున్నారు. ఇప్పుడు గవర్నర్ జనరలు హిందువు; ప్రధానమంత్రి హిందువు; ఉపప్రధాని హిందువు. త్రిసైనికశాఖలను హిందువులేనిర్వహిస్తున్నారు. స్వతంత్రభారత రాజధానిలో ఎగురుతున్న పతాక హిందూపతాక. హిందువులు అత్యధిక సంఖ్యాకంగాఉన్న మనరాజ్యాన్ని లౌకికరాజ్యం అని పిలిచినా, ప్రజాస్వామిక రాజ్యం అని అన్నా నాజీ ఫాసిస్టు రాజ్యం అని వ్యవహరించినా లేక మరే పేరుపెట్టిపిలిచినా, ప్రకృతి సిద్ధంగా అది హిందూరాజ్యమై ఉండకతప్పదు.

మన పతాకమీద ఉన్నచక్రం అశోకుని ధర్మచక్రం, శాంతికి చిహ్నంకాని ఎవరైనా దురాక్రమణ జరిపితేమాత్రం ఈ శాంతిచక్రమే సుదర్శన చక్రంగామారి విశ్వకల్యాణసాధకం అవుతుంది.

భారతదేశం సాధించిన స్వాతంత్ర్యం బ్రిటిషువారు దయతలచి యిచ్చిన దానం కాదు. ఈ విషయమై కొందరి మనస్సులలో అపోహలు ఏర్పడియున్నట్లు కన్పిస్తుంది. ఇక ఒక్క క్షణమైనా ఈ దేశంలో నిలవలేమని అనుకొన్నప్పుడే వారు ఈ దేశంనుంచి తరలిపోయినారు. దక్షిణ ఆఫ్రికా, సింగపూర్, హాంగ్‌కాంగ్‌ల నుండి ఉపసంహరించుకోకుండా ఒక్క భారతదేశంలోంచి మాత్రమే బ్రిటిషువారు ఉపసంహరించుకున్నారు అంటే దానికి అసహాయతే కారణంగాని ఔదార్యం కాదు. యీ ఉపన్యాసం ఇంతవరకు అయిన తర్వాత శబ్ద విపులీకరణ యంత్రం మళ్లీ చెడిపోవడంవల్ల కార్యక్రమాన్ని అంతటితో చాలించవలసినది.

## గుంటూరు పురపాలక సంఘ సమావేశం

గుంటూరు, డిసెంబరు 24: నిన్న సాయంకాలం గుంటూరు పురపాలక సంఘ అత్యవసర సమావేశం ఉప్పుటూరి వెంకట పున్నయ్య గారి అధ్యక్షతను జరిగింది.

# కమ్యూనిస్టు దుండగాలు జరిగిన గ్రామాలలో ఐ. జి. పర్యటన

## పోలీసు అధికారులతో చర్చలు

విజయవాడ, డిసెంబరు 25: పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్ జె. దేవసహాయం గారు నిన్న ఉదయం యిక్కడకువచ్చి గత బుధవారంరాత్రి హైదరాబాద్ సంస్థాన కమ్యూనిస్టు దాడికి గురి అయిన గ్రామాలను చూడటానికి వెళ్లారు. తిరువూరు వెడుతూ దారిలో కూనపరాజు పర్వ గ్రామాన్ని చూశారు. దేవసహాయం గారి వెంట ప్రత్యేక సాయుధ పోలీసు స్పెషల్ ఆఫీసరు ఒ. కె. బురెల్, కృష్ణా జిల్లాకలెక్టరు ప్యారే, ఉత్తర ప్రాంత డి. ఐ. జి. వి. ఆర్. రాజరత్నం, సి. జె. పి. పింటోగారలు ఉన్నారు.

పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్‌గారు చంద్రయ్య, మల్లయ్యగారల ఇండ్లకువెళ్లి చూశారు. చంద్రయ్య, మల్లయ్యలనుదాడిదార్లు ఇండ్లనుండిబయటకుపిలచి, రాగానే తాళ్లతోకట్టి, దగ్గరనున్న ఏటివద్దకు తీసుకొనివెళ్లి గొంతుకలుకోసి హత్యచేశారు. ఇన్‌స్పెక్టరు జనరల్ దుఃఖంలో మునిగి ఉన్న యీ కుటుంబాలను ఓదార్చారు. దాడిదార్లు వచ్చినప్పుడు గ్రామస్థులు ధైర్యంతో నిలబడి వారిని తరిమివేయవలసిందని దేవసహాయంగారు ఉద్బోధించారు. బూరగూడెం దోపిడీకేసులో కావలసియున్న వెంకట్రామరెడ్డి అనుకమ్యూనిస్టు యీ గ్రామంపై జరిగినదాడికి నాయకత్వం వహించాడనీ, దాడిదార్లవద్ద తుపాకులు మొదలైనవి వుండుటచే తాము చంద్రయ్య, మల్లయ్యలను రక్షించలేకపోయామనీ గ్రామస్థులు తెలియజేశారు.

మాధవరంలో దాడిదార్లచే హత్య చేయబడిన మాధవరావు సోదరుడు నరసింహారావు; దాడి పూర్తి వివరాలను తెలియజేశారు. మంగపతి పి. సుబ్బారావుల నాయకత్వాన యీ దాడి జరిగినదట.

గొల్లమండల గ్రామంలో దాడిదార్లు, అప్పలరాజు అను వానిని చంపుటకు 26 సార్లు బాకుతో పొడిచారట.

అక్కడనుండి బయలుదేరి దేవసహాయంగారు కోడూరు, అట్లప్రగడ, కంభంపాడు గ్రామాలను దర్శించారు.

తిరువూరులో మధ్యాహ్నం భోజనం ముగించుకొన్న అనంతరం, ఇన్‌స్పెక్టరు జనరల్‌గారు, సరిహద్దు దాడులను అరికట్టుటకుగాను తీసుకోవలసిన చర్యలను గురించి, పోలీసు అధికార్లతో చర్చించారు. ఈ సమావేశానికి కృష్ణాజిల్లాకలెక్టరు జె. పారేగారుకూడ హాజరయ్యారు. గ్రామస్థులను తమనుతాము రక్షించుకోవలసిందని సంపూర్ణ ప్రోత్సాహమిచ్చుట, తిరువూరుప్రాంతంలో సరిహద్దు కాపలాను యింకను కట్టుదిట్టంచేయుట, మలబార్ స్పెషల్ పోలీసులను అదనంగా ఏర్పాటుచేయుట మొదలైనవాటిని తక్షణ చర్యలుగా తీసుకోవాలని నిర్ణయం చేయబడింది.

నల్గొండ వరంగల్లు జిల్లాలలో కమ్యూనిస్టులు విజృంభిస్తున్నారనీ, కొట్టి పారిపోయే ఎత్తులు అవలంబిస్తున్నారనీ, హైదరాబాద్, మద్రాసు ప్రభుత్వాలు కలసి ఆలోచించి సంయుక్తంగా చర్య తీసుకొంటేనేతప్ప సరిహద్దు సంఘటనలను అరికట్టటం కష్టసాధ్యమనీ దేవసహాయంగారికి తెలియజేయబడింది. పై సమావేశంలో, ఒక డి. ఎస్. పి. తో ప్రత్యేక పోలీసు డివిజనును ఏర్పాటుచేయు విషయంకూడ చర్చించబడింది.

ఈ దాడులలో నష్టపోయినవారికి దేవసహాయంగారు స్వయంగా సానుభూతి తెలియజేశారు.

మధ్యాహ్నం పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్‌గారు ముష్టికుంట్ల గ్రామాన్ని దర్శించారు. ఇక్కడ దాడిదార్లు బసవయ్య అను వానిని హత్యచెయ్యటమేగాక వెంకయ్య అనువాని ఇంటినుండి 20 వేల రూపాయల ఆస్తి దోచుకొని, అతనిని కత్తితో గాయపరిచారు. వెంకయ్య ప్రస్తుతం తిరువూరు ఆస్పత్రిలో కోలుకొంటున్నారు.

పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెస్‌సంఘ కార్యదర్శి పేట బాపయ్యగారు ఇన్‌స్పెక్టరు జనరల్‌గారిని మధ్యాహ్నం తిరువూరులో కలుసుకొన్నారు. దేవసహాయంగారు సపరివారంగా చిట్టేల గ్రామానికి వెళ్ళారు. ఇక్కడ కోలి బుచ్చయ్య ధనిక రైతు దాడిదార్లను ధైర్యంతో ఎదుర్కొని తరిమివేసెను. దేవసహాయంగారు ఆయన ధైర్యానికి మెచ్చుకొని అభినందించారు. ఈయన ధైర్య, స్థయిర్యాలను తెలియజేస్తూ యీయనను తగినవిధంగా బహూకరించవలసిందని ప్రభుత్వానికి వ్రాసెదనని కృష్ణాజిల్లా కలెక్టరు అన్నారు. తర్వాత ఇన్‌స్పెక్టరు జనరల్ గోడలమీదనున్న తుపాకీగుండ్ల మచ్చలను, సగం తగలబడిన యింటిని, తలుపులపై తుపాకీగుండ్లవల్ల పడిన కన్నములను చూశారు.

గ్రామస్థులు తమకు ఆయుధాలివ్వవలసిందని ఇన్‌స్పెక్టర్ జనరల్‌కు విన్నవించగా, వీటిలో చాలభాగం దాడిదార్లకే అక్కరకువస్తాయని ఆయన అన్నారు.

దేవసహాయంగారు సాయంకాలం తిరిగివచ్చి రాత్రి మెయిలులో మద్రాసు వెళ్ళారు.

## రాజోలుతాలూకా బియ్యపు వర్తకుల సంఘం

రాజోలు, డిసెంబరు 22: ఈ నెల 20వ తేదీని తాటిపాకలో రాజోలు తాలూకా బియ్యపు వర్తకుల సంఘము ఏర్పాటైనది. జిల్లాబోర్డులోని సోషలిస్టు సభ్యుడు కుందెం సత్యనారాయణ మూర్తిగారు అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డారు. తాలూకాలో కంట్రోలు రేటుకు బియ్యము ప్రజలకు విక్రయించుట ఈ సంఘ ముఖ్యోద్దేశ్యమని తెలుస్తున్నది. స్వ. వి.

# తుపాను బాధితులకు సహాయం

## కొత్తగూడెంబొగ్గుగనుల ఉద్యోగుల విరాళం

సింగరేణి, డిసెంబరు 25: ఆంధ్ర తుపానుబాధితుల సహాయార్థం కొత్తగూడెంబొగ్గుగనుల కంపెనీ కార్మికులు ఉద్యోగులు, సిబ్బంది మద్రాసుగవర్నరు తుపానుబాధిత సహాయనిధికి రు 3702-6-4 లను సమర్పించారు.

### తాడేపల్లిగూడెం వస్త్ర వ్యాపారులవిరాళం

తాడేపల్లిగూడెం, డిసెంబరు 24: ఆంధ్ర తుపానుబాధిత సహాయనిధికి తాడేపల్లిగూడెం వస్త్రవ్యాపారుల సంఘం వారు రు 100 లు విరాళమిచ్చారు.

### గుంతకల్లులో తుపానుబాధిత సహాయసంఘం

గుంతకల్లు, డిసెంబరు 20: ఇక్కడ పి. వెంకటేశ్వర్లుగారు అధ్యక్షులుగా తుపానుబాధిత సహాయసంఘం ఒకటి ఏర్పాటుచేయబడివుంది. దీనికి శ్రీరామమూర్తిగారు ఉపాధ్యక్షులుగను, వి. సాంబసదాశివశాస్త్రిగారు కార్యదర్శిగను, పి. ఎస్. వి. కన్నారావుగారు కోశాధికారిగను ఉన్నారు. సంఘంవారు యింతవరకు రు 600 లను వసూలుచేసి గవర్నరు ఆంధ్ర తుపానుబాధిత సహాయనిధికి పంపారు.

## పాకిస్థాన్ రాజ్యాంగపరిషత్ కాంగ్రెస్‌పార్టీ

### రెండు బిల్లులను వాయిదా వేయించగలిగిరి

కరాచీ, డిసెంబరు 24: పాకిస్థాను రాజ్యాంగ పరిషత్తునందలి కాంగ్రెస్ పక్షమువారు నేడు రెండు ప్రభుత్వ బిల్లుల విచారణను వాయిదా వేయించిరి. ఎస్టేట్ డ్యూటీ బిల్లును, రాబడిపన్ను బిల్లును సభవారు విచారించవలెనని ఆర్థిక శాఖామంత్రి గులాంమహమ్మద్ ప్రతిపాదించగా బిల్లులను చదువుకొనుటకు తగినంత అవకాశం మియ్యలేదని ధీరేంద్రనాథ్ దత్తాగారు చెప్పిరి. అధ్యక్షుడు దత్తాగారి ఆక్షేపణను సమర్థించెను.


# ది ఆంధ్రా సిమెంటు కంపెనీ లిమిటెడ్

## బెజవాడ

## 12-9-1949, 8-12-'49 తేదీలు గల మా రిజిస్టర్డు నోటీసులకు రిమైండరు

దిగువ తెల్పిన వాటాదార్లకు లేక వారి వారసులకు, ఎగ్జిక్యుటర్లకు, అడ్మినిస్ట్రేటర్లకు ఇందుమూలముగ తెలియజేయునదేమనగా, వారి పేరట నున్న వాటాలఅల్లాటుమెంటు, వాయిదాల ధనముల క్రింద దిగువ వివరించిన మొత్తములు బాకీయున్నవి. పైన తెల్పిన మా నోటీసుల ప్రకారము, ఆయా షేర్ల ఎదుట తెల్పబడియున్న బాకీ తేదీనుండి చెల్లుబడి తేదీ వరకు సాలుసరి 6% వడ్డీతో సహా బాకీ మొత్తము 31-12-1949 తేదిన గాని, అలోపునగాని విజయవాడలోని కంపెనీ రిజిస్టర్డు ఆఫీసులో ఆఫీసు వేళలలో చెల్లించినచే తప్ప, ఆ మొత్తములు చెల్లింపవలసియున్న దిగువ తెల్పిన వాటాలు, కంపెనీయొక్క ఆర్టికిల్స్ ఆఫ్ అసోసియేషను ప్రకారము, ఇక మరి నోటీసు లేకుండ రద్దు (forfeit) చేయబడును.

వాటా 1 కి రు. 100 ల చొప్పున, 'ఎ' తరగతి సాధారణ వాటాలు

| రిజిస్టరు నం. | పేరు, అడ్రసు | షేర్ల విడినంబర్లు | | బాకీ మొత్తం | 15-11-1938 నుండి సాలుసరి 6% న వడ్డీతో చెల్లింపవలసినది |
|---|---|---|---|---|---|
| | | | | రు. | |
| 4 | శ్రీ కె. నాగేశ్వరరావు పంతులుగారు, మద్రాసు ... | 111 | 115 | 450 | 15-11-1938 |
| 117 | శ్రీ కె. చలపతిరావు, విశాఖపట్టణము ... | 1702 | — | 60 | డిటో |
| 120 | శ్రీ మద్ది సీతారామయ్యగారు, మెయిన్‌రోడ్డు, విశాఖపట్టణము ... | 1720 | 1721 | 160 | డిటో |
| 250 | శ్రీ కె. వి. వి. గోపాలరాజు, విశాఖపట్టణము ... | 3679 | 3680 | 120 | డిటో |
| 251 | శ్రీ చాగంటి సాంబశివరావు, విశాఖపట్టణము ... | 3681 | 3682 | 120 | డిటో |
| టి. 103 | శ్రీ గురుపూర్ సర్వోత్తం పాయ్, గోల్డెన్‌రాక్ (తిరుచ్చి) | 3810 | 3811 | 160 | డిటో |
| టి. 169 | శ్రీ కోలపల్లి లక్ష్మయ్య, మచిలీపట్టణము ... | 9797 | 9800 | 320 | డిటో |
| టి. 15 | శ్రీ పి. ఆర్. కె. ఎల్. ఎస్. టి. ఎన్. నాచ్చియప్ప చెట్టియార్, దేవకోట ... | 7213 | 7227 | 1200 | డిటో |

వాటా 1 కి రూ. 100 చొ.న ప్రిఫరెన్సు వాటాలు

| రిజిస్టరు నం. | పేరు, అడ్రసు | షేర్ల విడినంబర్లు | | బాకీ మొత్తం | |
|---|---|---|---|---|---|
| పి. 2 | శ్రీ కె. నాగేశ్వరరావు పంతులుగారు, మద్రాసు ... | 41 | 45 | 400 | 15-11-1938 |
| పి. 177 | శ్రీ టి. ఎస్. నటరాజన్, ఒరయూర్ ... | 1335 | 1339 | 400 | డిటో |
| పి. 260 | శ్రీ కే. ఎన్. చోయకుట్టి, ఇరన్‌హిపాలెం, కాలికట్, మలబార్ ... | 1715 | 1716 | 160 | డిటో |

వాటా ఒకటికి రు. 10/- చొ.న 'బి' తరగతి సాధారణ వాటాలు

| రిజిస్టరు నం. | పేరు, అడ్రసు | షేర్ల విడినంబర్లు | | బాకీ మొత్తం | |
|---|---|---|---|---|---|
| బి. 51 | శ్రీ విశ్వనాథ్ ఎస్. నాయక్, హైదరాబాదు (దక్కన్)... | 26940 | 27374 | 2175 | 1-10-1946 |
| బి. 74 | శ్రీ లాధరాం సుసేజా, లియాల్‌పూర్ ... | 34761 | 35920 | 5800 | డిటో |
| బి. 110 | శ్రీ శివారామెరాం ఖన్నా. లీలాధవన్ 15, తిలక్‌రోడ్డు, న్యూఢిల్లీ. ... | 52314 | 52603 | 1450 | డిటో |
| బి. 202 & 434 | శ్రీ బోడ వెంకటరత్నం. తాపేశ్వరం ... | 97904<br>179241 | 98019<br>179524 | 2000 | డిటో |
| బి. 214 | శ్రీ ఎస్. హెచ్. ఎల్. నారాయణన్, బెంగుళూరు ... | 101204 | 101228 | 125 | డిటో |
| బి. 329 | శ్రీ బి. ఎస్. సంజీవచెట్టి, చన్నపట్న ... | 132689 | 133368 | 3625 | డిటో |
| బి. 338 | శ్రీ ఎ. ఆర్. ఎం. ఎల్. వెంకటాచలం చెట్టియార్, రామ్నాడు ... | 134889 | 135178 | 1450 | డిటో |
| బి. 375 | శ్రీ టి. బి. బాలగోపాల్, మద్రాసు ... | 141752 | 141951 | 1000 | డిటో |
| బి. 396 | శ్రీ ఎస్. బాలకృష్ణన్ నాయర్, తిరుచెంద్రం ... | 167175 | 167674 | 2500 | డిటో |
| బి. 414 | శ్రీ సి హెచ్. వి. సూర్యనారాయణమూర్తి, గాంధినగర్, విశాఖపట్టణం ... | 171980 | 172024 | 225 | డిటో |
| బి. 418 | ప్రొ. ఆర్. ఎ. కులకర్ణి, బెల్గాం, (బొంబాయి) ... | 175050 | 175124 | 375 | డిటో |
| బి. 436 | శ్రీ డి. వి. కృష్ణంరాజు, విశాఖపట్టణం ... | 180960 | 181065 | 530 | డిటో |
| బి. 472 | శ్రీ వి. టి. ఆర్. చంద్రన్, మద్రాసు ... | 194631 | 194730 | 500 | డిటో |
| బి. 532 | శ్రీ చెక్కా రామానుజం, కాకినాడ ... | 216922 | 216956 | 225 | డిటో |
| బి. 642 | శ్రీ ఎం. బాలకృష్ణారెడ్డి, పోలూరు ... | 280227 | 280526 | 1500 | డిటో |
| బి. 661 | శ్రీమతి దారా నాగేశ్వరాంబ, చిలకలపూడి పోస్టు ... | 286227 | 286326 | 500 | డిటో |
| బి. 671 | శ్రీ పి. ఎం. భట్, మంగుళూరు ... | 290477 | 290501 | 50 (శేషము) | డిటో |
| బి. 674 | శ్రీ నందిపాటి రంగనాయకులు, బెజవాడ ... | 290542 | 290566 | 125 | డిటో |
| బి. 794 | శ్రీ కె. కన్నయ్యపంతులు ఆనే నరసయ్యపంతులు, ముల్పూరు (తెనాలి) ... | 300592 | 300691 | 500 | డిటో |
| బి. 823 | శ్రీ బొలిసెట్టి సూర్యనారాయణరావు, నరసరావుపేట ... | 302137 | 302166 | 150 | డిటో |
| బి. 877 | శ్రీ పెన్మెచ్చ వెంకటరామరాజు, పాలకొల్లు ... | 303882 | 303901 | 100 | డిటో |
| బి. 888 | శ్రీ దేవతా చెంచురామయ్య, నాయుడుపేట ... | 306302 | 306311 | 50 | డిటో |
| బి. 912 | శ్రీమతి సుంకు యశోద, నెల్లూరు ... | 308512 | 308561 | 250 | డిటో |
| బి. 951 | శ్రీ తాన్యూరి కృష్ణయ్య, ఎలమంచిలిగ్రామం, పాలకొల్లు | 311522 | 311591 | 343 | డిటో |
| బి. 952 | శ్రీ తాన్యూరి సత్యకుమార ధరతుము, ఎలమంచిలిగ్రామం, పాలకొల్లు ... | 311592 | 311661 | 343 | డిటో |
| బి. 960 | శ్రీ ఎ. సుబ్రహ్మణ్యం, మద్రాసు ... | 311962 | 312161 | 1000 | డిటో |
| బి. 1053 | శ్రీమతి పిచ్చమ్మాళ్, సిమిలి ... | 330822 | 330921 | 350 (శేషము) | డిటో |
| బి. 1177 | శ్రీ దీప్‌చంద్ జె. మెహత, కరాచి ... | 340662 | 340761 | 500 | డిటో |
| బి. 1501 | శ్రీమతి మాజేటి వీరరాఘవమ్మ, ఏలూరు ... | 381600 | 381609 | 50 | 11-10-1946 |
| బి. 1502 | శ్రీ మాజేటి చినవారాయణరావు, ఏలూరు ... | 381610 | 381619 | 50 | డిటో |
| బి. 1555 | శ్రీ టి. ఎస్. వెంకటరామన్, సేలం ... | 386695 | 386794 | 500 | డిటో |
| బి. 1607 | శ్రీ కె. ఆర్. ఎం. ఎస్. శంకరఅయ్యర్, వీరవనల్లూరు ... | 397270 | 397319 | 250 | డిటో |
| బి. 1627 | రావ్ బహాదూర్ సేట్ కిషోర్‌చంద్ మహేశ్వరి, అమృత్‌సర్ ... | 398660 | 398759 | 500 | డిటో |
| బి. 1511 | శ్రీ మాజేపల్లి వెంకటనారాయణ, ఏలూరు ... | 382135 | 382144 | 15 | డిటో |

బోర్డు వారి అనుమతిని

విజయవాడ, 16-12-49.

సి. ఎస్. రాజు
డైరెక్టరు (ఎక్స్-అఫిషియో)

# శుక్ర శక్తి
(గవర్నమెంటు రిజిస్టర్డు)
ధాతుపుష్టి లోపము, బహిష్ఠు క్రమభంగము పుంస్త్వహీనత, పోగొట్టి యౌవనశక్తి, బలము, ధాతుపుష్టి వృద్ధిపరచును. పెద్దది రు. 6/-లు. చిన్నది రు. 4/-లు. వి. పి. రు. 0-14-0 లు.

# అగ్నిరాజ్
ఆమ్లాధిక్యత, అజీర్తి, వాయువు, కీళ్ల నొప్పులు తదితర కడుపు నొప్పులు అన్నిటిని పోగొట్టును. ఖరీదు రు. 3/- వి. పి. 14 అణాలు లాభకరమైన వ్యాపార షరతు. జాబులు యింగ్లీషులో స్పష్టముగా వ్రాయండి.
DACCA OUSHADHALAYA LTD. [A.M].
56c, Beadon St, Calcutta.
స్టాకిస్టులు: శాస్త్రి డిస్పెన్సరి, ట్రంకు రోడ్డు, నెల్లూరు,
ఏ మందైనా 3 డబ్బీలు కొంచే రూపాయకు రెండణాలు కమీషను యివ్వబడును.

Self Contained Pulse (Dal) Mills.
సంపూర్ణమైన పప్పుల మరలు
...
యూనియన్ ఇండస్ట్రియల్ వర్కు్స్

లైసెన్సు అవసరం లేదు
అమెరికన్ మోడల్ రివాల్వర్
...
Hindustan Traders
P. Box No. 236, Kanpur

బాంకింగ్ వసతులన్నియు ఇవ్వబడును.
ది యునైటెడ్ కమర్షియల్ బాంక్ లిమిటెడ్.
హెడ్ ఆఫీస్, కలకత్తా.


# వివిధ గ్రామాలలో చిత్రవధలు

## కాకాని వెంకటరత్నంగారి ప్రకటన

చెన్నపట్నం, డిసెంబరు 24: పశ్చిమ కృష్ణా జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు కాకాని వెంకటరత్నంగారు యీ క్రింది ప్రకటన చేయుచున్నారు: ఈనెల 21-వ తేదీ రాత్రి యూనియన్-హైదరాబాదు కమ్యూనిస్టులు సుమారు 150 మంది తిరువూరు తాలూకాలోని, ముష్టికుంట్ల, పుట్రేల, అట్లప్రగడ, కూనపరాజుపర్వ, కంభంపాడు, గొల్లమందల, ముచ్చెనపల్లి, మాధవరం, కంభంపాడు, రోలుపడె గ్రామాలపై, మిలిటరీ యూనిఫారముతో నాయకులై దాడిచేశారు. రాత్రి 9 గం. లకు తిరువూరుకు 2 మైళ్ల దూరంలో యున్న పుట్రేల గ్రామమును 20 మంది దాడివల్లారు. కొల్లిబుచ్చయ్యగారి యింటి పైకిపోయి కాల్పులు కాల్చారు. 65 సం॥ వయస్సుగల బుచ్చయ్యగారు అతిసాహసముగా అక్కడే 75 సార్లు తిరిగి ఎదురు కాల్చారు. చేయునదిలేక కమ్యూనిస్టులు పెట్రోలుపోసి బుచ్చయ్యగారింటిని తగుల...

...రు. అంత కమ్యూనిస్టులు చంద్రయ్యగారి యింటికి వచ్చారు. ఇంటియొద్ద చంద్రయ్య లేకపోయినందువల్ల కమ్యూనిస్టులు తిరిగి దివాణము యొద్దకు వెళ్లుచుండగా చంద్రయ్యగారు ఎదురయ్యారు. చంద్రయ్యగారిని, ముత్తాసు ఎల్లయ్యయను నాకరును యిద్దరను కమ్యూనిస్టులు గ్రామం సమీపలికి తీసుకవెళ్లి యిద్దరి గొంతులు కోసి వేశారు.

తరువాత మైలు దూరములో యున్న మా.వరం గ్రామము వెళ్లారు. వంగవీటి మానవరావుగారి యింటిపైపడి అన్నదమ్ములను పిలిచి ఇనుపపెట్టె తాళము చెవులు యిమ్మన్నారు. తాళము యివకపోతే పలుగుతో పగులు గొట్టుచుండగా మానవరావుగారి తమ్ముడు నరసింహారావుగారు ఎత్తయిన ప్రహరి గోడను దూకి పారిపోయినాడు. ఏనదు, నగలు రు. 15,000/-పైకము దోచుకొని మాధవరావుగారిని పూర్తి బయటకు తీసుకొనివెళ్లి తుపాకితో కాల్చి చంపారు.

తాలూకా మొత్తముమీద పెద్ద ప్రాతతో 12 గ్రామాలు దాడిచేయుట చూసి ప్రజలలో చాల గందరగోళముగా యున్నది. ప్రభుత్వముతో సహకరించుటకు, కమ్యూనిస్టులు చేయు హత్యలు చూచి ప్రజలు భయకంపితులగుచున్నారు. ...

# పిడికిటి రామకోటయ్యగారు తెలిపిన వివరాలు

...

# పోలీస్ ఇన్‌స్పెక్టర్ జనరల్ రాక

...

# శ్రీ శ్రీ బంగారు రంగరాజుగారు

...

# మద్రాసు ఒరిస్సా సరిహద్దుల్లో విశాఖజిల్లా రైతుల ఇబ్బందులు

## ఉ. వి. జిల్లా కాంగ్రెస్ ప్రధానకార్యదర్శి ప్రకటన

శ్రీకాకుళం, డిసెంబరు 25: ఉత్తర విశాఖ జిల్లా కాంగ్రెసుసంఘ ప్రధాన కార్యదర్శి పి. వుణ్ణేశాచారిగారు యిట్లు ప్రకటించుచున్నారు.

ఉత్తర విశాఖజిల్లాలో వరదలవల్ల దెబ్బతిని, పంటలుపాడైన పొలాలకు శిస్తు రెమిషను యివ్వబడునని మద్రాసు ప్రభుత్వం ప్రకటించినప్పటికీ, స్థానిక అధికారులు ఈ ఉత్తర్వులు రాలేదని పూర్తిగా శిస్తులు వసూలుచేయుచున్నారు. కాబట్టి ప్రభుత్వంవారు పంటనేరదప్రాంతాలలో శిస్తులు నిలుపుదల చేస్తూ రెమిషనుగూర్చిన ఉత్తర్వులు రెవెన్యూ అధికార్లకు వెంటనే పంపవలసిందని కోరుచున్నాను.

మదరాసు-ఒరిస్సా సరిహద్దుజిల్లాలైన విశాఖ, గంజాం కోరాపుట్టిజిల్లాలలో అనాది సినముగ, విశాఖజిల్లావాసులు...

...చున్నవి. ఒరిస్సా ప్రాంతములలో పంట ఉత్పత్తిచేసిన రైతులలో యిట్టిచర్యలు చాలా ఆందోళన, అలజడిని కలుగజేస్తున్నవి.

కావున మదరాసు-ఒరిస్సా ప్రభుత్వములు, యిందువిషయమై జాగ్రత్తగ ఆలోచించి విశాఖ రైతులు ఒరిస్సా ప్రాంతంలో పండించిన ఆహారదినుసులు వగైరా, ఎట్టి ఆటంకము లేకుండా తెచ్చుకోడానికి ఉత్తర్వులు వెంటనే జారీచేయవలసినదని కోరుచున్నాను. (స్వ. వి.)

# అలమూరు వంతెన నిర్మాణానికి పురిటిలోనే సంధి కొట్టిందా?

కాకినాడ, డిశం 20:—అలమూరు వద్ద గోదావరిపై రోడ్డు వంతెనకు శంకుస్థాపన శ్రీ కళా వెంకట్రావుగారు జరిపిరి. మద్రాసు ప్రధాన యింజనీరు, మంత్రి భక్తవత్సలం గార్లు ఘనమైన ఉపన్యాసాలిచ్చారు. కాని ఆంధ్ర రాష్ట్రానికి ఎన్ని అడ్డంకులు ఉన్నాయో దీనికి కూడ అట్లేనని భావించవలసి వస్తున్నది.

అలమూరువద్ద కాల్వపై ఒక వంతెన తర్వాత లంకలో రెండు ఫర్లాంగులు యెత్తైన కాపుదల గట్టులతో రోడ్డు, ఆ పిమ్మట 1¼ మైలు నదిలో వంతెన, రావులపాలెం లంకలో రెండు ఫర్లాంగులు...

...వని, మిగత సొమ్మును అరవ జిల్లాల్లో ఉపయోగించుకొన్నట్లును తెలుస్తూంది. దీని విషయమై ఆంధ్ర, తమిళ ప్రతినిధులకు చర్చలు జరుగుతున్నట్లు కూడ తెలియుచున్నది.

అసలు రామపాద సాగర ప్రాజెక్టు డివిజను ఎత్తివేసినట్లే, గోదావరి వంతెన డివిజను కూడ మద్రాసు పబ్లిక్ వర్క్సు శాఖవారు ఎత్తివేసినట్లును, ఆంధ్రప్రతినిధులు తిరిగి ఆందోళన చెయ్యగా యీ డివిజను మూడు నెలలపాటు కొనసాగించుట కంగీకరించినట్లును తెలుస్తూంది. ఆంధ్ర ప్రాంతములలో పనులకట్టి ఆటంకములు కల్పింపబడుచున్నవో యిదొక ఉదాహరణగా ప్రజలు గ్రహించి త్వరలో ఆంధ్రరాష్ట్ర నిర్మాణము అమలుజరిగేటట్లు ఆందోళన చేయవలెను.

పశ్చిమగోదావరి ఖండపల్లి నుంచి ట్రంకు రోడ్డు దువ్వా, తాడేపల్లిగూడెం, భీమడోలు మీదుగా పోవును. దీని కట్టి ఆక్షేపణలేదు. కాని తూర్పు గోదావరి జిల్లాలో ట్రంకురోడ్డు మార్పుగురించి మాత్రము యింకను భేదాభిప్రాయములు కనపడుచున్నవి. అలమూరునుంచి మండపేట, రామచంద్రపురం, కాకినాడ మీదుగా కత్తిపూడివద్ద గ్రాండుట్రంకు రోడ్డు కలుపవలెనని శాసనసభ్యుల అభిప్రాయం. కాని ప్రభుత్వమువారు అలమూరు, మండపేటనుంచి అనవర్తి, చామర్లకోట, పిఠాపురం మీదుగా కత్తిపూడివద్ద ట్రంకు రోడ్డు ఏర్పరచవలెనని సంకల్పించినట్లు తెలియుచున్నది.

# మద్రాసు పూలవర్తకుల, కమిషన్ ఏజంట్ల అస్సోసియేషను

## తమకు అమ్మకపు పన్ను తొలగించవలసినదిగా విజ్ఞప్తి

మద్రాసు, డిసెంబరు 23: మద్రాసు పూలవర్తకుల, కమిషన్ ఏజంట్ల అస్సోసియేషన్‌వారు తమ వర్తకమునకు అమ్మకపు పన్ను మినహాయించవలసినదిగా మద్రాసు ప్రభుత్వ ఆర్థిక మంత్రికి ఒక నివేదికను పంపియున్నారు. పూలు నిలవఉండవనీ, ఏరోజు కారోజు అమ్మితేనేతప్ప అమ్మేవారికి నష్టంవస్తుందనీ, ఈ వర్తకం చేసేవారు చిల్లర వర్తకులేగాని పెద్ద పెట్టుబడిదారులుకారనీ, పువ్వులుకొనే వారివద్ద పన్ను వసూలుచేయ్యడంలేదనీ, పువ్వుల వర్తకులు దాదాపు అందరూ చదువురాని...

# పాకిస్థానుకు పంపిన ఇండియన్ మనియార్డర్లు

## నూటికి 69/- మాత్రమే చెల్లించుటకు పాక్ ప్రభుత్వ నిర్ణయం

...

# మూలనున్న ముసమ్మపై మేటిమగటిమి!

...

# నోటీసు

నా క్లయింటుగారైన విజయనగరం వాస్తవ్యులు-రాయిసాహెబ్ మహబూబ్ శ్రీ పేర్ల రామమూర్తిశెట్టిగారి ధర్మపత్నిగారయిన శ్రీ పేర్ల అన్నపూర్ణమ్మగారు యిచ్చిన భోగట్టా ప్రకారం యీ నోటీసు ప్రచురణ చేయడమైనది:

నా క్లయింటు దత్తత కుమారుడైన శ్రీ పేర్ల సత్తెయ్యశెట్టిగారికి, నా క్లయింటు భర్తగారైన శ్రీ సేటు పేర్ల రామమూర్తిశెట్టిగారి తే 1-11-1918 దీ గల వీలుప్రకారం రెండు లక్షలు కిమ్మత్తుచేయు చిన వాస్తేశ రొస్టేటున్ను మరికొన్ని గ్రామములున్ను 1922 వ సంవత్సరములోనే యిచ్చివేయడమైనది. మిగతా శ్రీరామమూర్తిశెట్టిగారి యావత్తు చరస్థిరాస్తులయందు దత్తునికి యెట్టి హక్కు లేదు. చీపురుపల్లి తాలూకా, తూర్పు పేరు మహమ్మదుపురం రొస్టేటున్ను, పాలకొండ తాలూకా నరేంద్రపురం గ్రామంలో భూములున్ను, విజయనగరం పంతపేటలో యున్న మసాబున్ బిల్డింగ్సున్ను, యితర యిళ్లున్ను, గాజులరేగ, తంగుడుబిల్లి, ధర్మపురి, వంటితాడి అగ్రహారంలో యున్న తోటలు, భూములు, శ్రీ రాజగోపాల రైస్ మిల్లు వగయిరా యావత్తు స్థిరాసులు నా క్లయింటుగారివై యున్నవి. ...

...అధికారము యిచ్చియుండలేదు. దత్తుడు చేస్తూయున్న అక్రమపు చర్యలకు నా క్లయింటు చర్య తీసుకొనుచున్నారు. కాబట్టి యిందుగల్ల సమస్తమైనవారికి తెలియజేయడమేమనగా:— నా క్లయింటుగారికి చెల్లించవలసిన పైకము యావత్తు నా క్లయింటుగారికి జనరల్ పవర్ ఆఫ్ అటర్నీ యేజంటుగారైన శ్రీ దారా త్రిపురసుందర లింగంగారి పుత్తురవులకు లోబడి చెల్లించవలయునుగాని, శ్రీ పేర్ల సత్తెయ్యశెట్టిగారికి యెంతమాత్రం చెల్లించకూడదు. అట్లు యెవరైనా చెల్లించేయెడల వారు నష్టపోవుదురు. నా క్లయింటుగారిని యెంతమాత్రం బంధించదు.

గుండాల బదరీనారాయణమూర్తి,
ఎడ్వకేటు, విజయనగరం.


గ్యారంటీగా ఎల్లప్పుడు కాంతిగా నుండును.
# స్టెయిన్‌లెస్‌స్టీల్‌సామానులు
(ఇత్తడిలో గూడ)
విలాసమైనవి. కాని చౌక. ఆరోగ్యవంతమైనవి. కలకాలము మనును.


# కావలెను

ఏలూరులోని ఏలూరు కో-ఆపరేటివ్ స్టోర్సులో మానేజరు ఉద్యోగమునకు దరఖాస్తులు కావలెను. స్కేలు 65-3-95 లు, పైన కరువు భత్యము 12, సైకిల్ అలవెన్సు 3. అభ్యర్థి యోగ్యతలు: ... (సం.) వై. శ్రీహరిరావు, ప్రెసిడెంటు, ఏలూరు కో-ఆపరేటివ్ స్టోర్సు.

# ప్రకటన

ఇండస్ట్రీస్ అండ్ కామర్సు డిపార్టుమెంటు, మద్రాసు.

...

డైరెక్టర్ ఆఫ్ ఇండస్ట్రీస్ అండ్ కామర్సు.


# మదనకామేశ్వర లేహ్యం
ఇది మేహములు, విశాఖ, విస్ఫుత్తువ, శుక్లనష్టము, అతిమూత్రము, మొదలగువాటిని తుంచి, మంచి బలమును వీర్యవటుత్వమును కలిగించుటలో అద్భుతమైనది. 2 డబ్బీలు టొటుకు. 20 తులముల డబ్బి రు 2/- పోస్టేజి ప్రత్యేకము.
పి. సి. ఏ. అండ్ కంపెనీ.
ఆయుర్వేదసమాజం, పెరిడేపి, (నెల్లూరుజిల్లా)
బ్రాంచి: 7. వీరు మొదలివీధి, మద్రాసు.

# ఎల్లప్పుడు వీటినే వాడండి
'పైలట్' బ్రాండ్ రిఫైన్ ఆయిల్ వంటపనుల కన్నిటికి శుద్ధమైనది, శ్రేష్ఠమైనది
'సిగ్మా' బ్రాండ్ వాషింగ్ సబ్బులు శుభ్రపరచు పనుల కన్నిటికి శ్రేష్ఠమైన సబ్బులు
వివరములకు:
శ్రీ సత్యనారాయణ రిఫైండ్ ఆయిల్ కంపెనీ
పో. బా. నం. 89, గుంటూరు.

# వింకోలా
పరిశుద్ధమైన టానిక్ విటామిన్ "బి" లో
SPW
స్టాండర్డు ఫార్మస్యూటికల్ వర్క్సు లిమిటెడ్.
సోల్ డిస్ట్రిబ్యూటర్సు:
స్టాండర్డు ప్రొడక్ట్సు లిమిటెడ్. "కార్నర్ ఎస్టేటు" 79, ఎస్ప్లనేడ్, మద్రాసు 1.

# ఆంధ్రరాష్ట్రరాజధాని నగరం

## విజయవాడ కాదగునని పట్టణ న్యాయవాదుల సూచన

విజయవాడ, డిశెంబరు 24: విజయవాడ న్యాయవాదుల సంఘమువారు యం. కోటేశ్వరరావుగారి అధ్యక్షతక్రింద ఈ మధ్య సమావేశమై, విజయవాడ యొక్క భౌగోళిక, చారిత్రక ప్రాముఖ్యతను గమనించి, ఈ పట్టణమును ఆంధ్రరాష్ట్రమునకు రాజధాని నగరముగా చేయవలెనని విధజనసంఘమునకోరుచూ తీర్మానించిరని న్యాయవాది సంఘ కార్యదర్శి యల్. నిరంజనరావుగారు తెల్పుచున్నారు.

## విజయవాడ విశ్వబ్రాహ్మణ సంఘ సభ

విజయవాడ, డిశెంబరు 19: ఈ పట్టణ విశ్వబ్రాహ్మణ సంఘమువారు నిన్న సోమనాధ పిల్లలూరిగారి అధ్యక్షతను సమావేశమైరి. పెనప్రోలు సూర్యనారాయణ రావుగారు సభను ప్రారంభించిరి. అంగలకుదిటి భావయ్యాచార్యులు, సర్వసిద్ధి సూర్యనారాయణగారు మొదలగువారు ఉపన్యసించిరి. ఆంధ్రరాష్ట్ర నిర్మాణము విషయంలో నాయకత్రయ నివేదికను ఆమోదించినందులకు ఆంధ్ర కాంగ్రెసు నాయకుల నభినందించుచూ, అవతరించినున్న శాసనసభయందు ఈసంఘీయులకు ప్రాతినిధ్యము కల్పింప ప్రభుత్వమును కోరుచు, హిందూధర్మ క్రోడీకరణ బిల్లు బలపరుచుచు, కాంగ్రెసు సంఘమునందు ఈ సంఘీయులు విరివిగా చేయవలెనని తీర్మానములు చేసిరి.

### దేవాలయ ధర్మకర్తల సమావేశాలు

హిందూ దేవాలయ ధర్మదాయబిల్లును మద్రాసు ప్రభుత్వము సవరణచట్టము చేయుచున్నందున, ఈ సందర్భమున ఆంధ్రరాష్ట్రములోని దేవాలయాల ధర్మకర్తలు సమావేశము నొకదానిని ఇచ్చట జరుపుట యుక్తమని, ధర్మకర్తలు వారి వారి అభిప్రాయములు వలయునంతి త్వరలో తనకు తెలుపవలెనని విజయవాడ శ్రీ కనకదుర్గా మల్లేశ్వరస్వామి దేవస్థానం ధర్మకర్త పిన్నమనేని పున్నయ్యగారు ప్రకటించుచున్నారు.

ఇచ్చటి హిందూమత పేటలో శంకర మఠస్థాపకులగు శ్రీ చిదానంద సరస్వతీ స్వాములవారి ప్రథమ ఆరాధన దినము భక్తులచే జరుపబడెను.

### స్నేహానగర్ సేవాసంఘము

విజయవాడలోని రాజేశ్వరీ పేట, స్నేహానగరము, రాజయ్యపేటలలోని ప్రజలు డిసెంబరు 18-న స్నేహా నగరములో సమావేశమయి పై మూడు పేటల పురోభివృద్ధికిగాను జిల్లా, స్థానిక, మునిసిపల్ అధికారులతో సంప్రదించి రోడ్లు, లైట్లు, మంచినీటివసతి వెంటనే కలుగ చేయించుటకుగాను "స్నేహా నగర సేవాసంఘము"ను స్థాపించుకొనిరి. దీనికి జుబ్బుల వీరయ్యగారు అధ్యక్షుడుగ, అనుభోజు అప్పలస్వామిగారు ఉపాధ్యక్షుడుగ, యిరటూరి శేషగిరిరావుగారు ప్రధాన కార్యదర్శిగ, పలిశెటి బాలేందు శేఖరశాస్త్రిగారు సహాయక కార్యదర్శిగ, కడవకొల్లు నరసింహారావుగారు కోశాధికారిగా ఎన్నుకోబడిరి.

'స్నేహా నగర గ్రంధాలయము'ను స్థాపించి యీ శర్వరిగమే గ్రంధాలయమును కూడా నిర్వహించవలెననీ అన్ని పేటలలోను వెంటనే మునిసిపల్ వారిచే దీపములు పెట్టించవలెననీ స్నేహా నగరములో మంచినీటి బావులను త్రవ్వించవలెనని, స్నేహా నగరములో నివారికి వెంటనే వారు నివసించు ప్రదేశమునకు పట్టా లిప్పించవలెనని ప్రజలందరకు అందుబాటులో నుండునట్లుగా బియ్యము, పంచదార, కిరసనాయిలు, మొదలయిన జీవితావసర వస్తువులు చౌకగా లభించునటుగా కోపరేటివు డిపోను పెట్టించుకోవలెనని తీర్మానించిరి.

## నవ్యకళా పరిషత్

### విజయవాడ

ఆంధ్రదేశమునకు కేంద్రవస్తు ప్రదర్శనశాల, కేంద్ర గ్రంధాలయము, కేంద్ర చిత్రశాలనిలయము విజయవాడలో స్థాపించవలెనని, ఆంధ్ర ప్రాంత పురావస్తు శిల్పపరిశోధ శాఖ కేంద్రస్థానము బందరు నుండి విజయవాడకు మార్చవలెనని, ప్రస్తుతము లండనులోనున్న ఇండియా ఆఫీసు గ్రంధాలయమును, భారతదేశమునకు, తీసుకవచ్చి ఆంధ్రదేశమునకు సంబంధించిన గ్రంధములను విజయవాడ కేంద్ర గ్రంధాలయములో నుంచవలెనని, అఖిలభారత లలితకళా పరిషత్తులో ఆంధ్రులకు తగు స్థానమొసంగబడుటయేగాక, ఆంధ్రదేశీయ లలితకళాభివృద్ధికి తగిన స్థానమీయవలెనని, మదరాసులోని ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో నున్న ఆంధ్ర గ్రంధములను ఆంధ్రరాష్ట్రమునకు కేటాయించి విజయవాడ కేంద్ర గ్రంధాలయములో నుంచవలెనని, మద్రాసు మ్యూజియములోని ప్రాచీన శిల్పసంపదలో ఆంధ్రులకు చెందవలసిన భాగమును వెంటనే ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు ముందుగనే కేటాయించి ప్రత్యేకముగా పంచి విజయవాడలోని వస్తుప్రదర్శనశాలకు కల్పించవలెనని సభలో తీర్మానములు చేసిరి.

# తెనాలి పురపాలక సంఘ సమావేశం

## 1950-51 బడ్జెటు అంచనాల ఆమోదం

తెనాలి, డిసెంబర్ 25: ఈ పురపాలక సంఘ అత్యవసర సమావేశం మొన్న సాయంకాలం నన్నపనేని వెంకట్రావుగారి అధ్యక్షతను జరిగినప్పుడు పురపాలక సంఘ 1949-50 క్రొత్త బడ్జెటును, 1950-51 బడ్జెటు అంచనాలు ఆమోదించబడినవి. విశ్వనాధ భవన సంఘ కమీషనరును డైరక్టరుగా నియమించుచూ తీర్మానించారు.

సాయంకాలం 5 గం. లకు తిరిగి సమావేశం జరిగినప్పుడు పురపాలకసంఘ ప్రాథమికవిద్య 1949-50 క్రొత్త బడ్జెటు 1950-51 బడ్జెటు అంచనాలు ఆమోదించబడినవి. (స్వ. వి.)

## తెనాలి పంచాయితీకోర్టు

### అధ్యక్షులుగా సూర్యదేవర లక్ష్మీనారాయణగారి ఎన్నిక

తెనాలి, డిశెంబరు 24: తెనాలి పంచాయతీకోర్టు అధ్యక్షులుగా సూర్యదేవర లక్ష్మీనారాయణగారు ఏకగ్రీవముగా ఎన్నుకోబడిరి. వీరు యీ కోర్టుకు అధ్యక్షులుగా యిదివరకు నాల్గు పర్యాయములు ఎన్నుకోబడియుండిరి. (స్వ. వి.)

### నగరసంఘ సమావేశము

తెనాలి, డిసెంబరు 24: ఈతాలూకా చేబ్రోలు గ్రామంలో నిన్న నగరసంఘీయుల సమావేశం వేల్పూరి సుబ్బారావుగారి అధ్యక్షతను జరిగినది. సంఘాభివృద్ధిని గురించి, సంఘ నిబంధనలను గురించి నగర పత్రికా సంపాదకులు మునికి వీరాస్వామి రాష్ట్ర నగరసంఘసభ్యులు ధనికొండ రాఘవయ్య మొదలగువారు మాట్లాడిన పిదప చేబ్రోలులో నగర సంఘీయులకు వక గ్రంధాలయాన్ని స్థాపించుటకు తీర్మానించిరి.

# నగరి ఫిర్కా అభివృద్ధి సంఘ సమావేశం

నగరి, డిసెంబరు 23:—ఈ ఫిర్కా అభివృద్ధి సంఘ సమావేశము నేడు స్థానిక ఉన్నత పాఠశాల ఆవరణలో చంద్రగిరి రివిన్యూ డివిజనల్ ఆఫీసరు కె. ఎస్. శివసుబ్రహ్మణ్యంగారి అధ్యక్షతను జరిగింది.

సమావేశానికి ముందు అధ్యక్షుడు కోరం లేనందున నేటి సమావేశాన్ని వాయిదా వేయుటకు నిశ్చయించి, తర్వాత కొన్ని ముఖ్యమైన విషయాలను మాత్రం మరుసటి సమావేశానికి వాయిదా వేస్తూ, కొన్నిటిని మాత్రం నేడు చర్చించుటకు పూనుకొన్నారు.

నేటి సమావేశానికి ముఖ్యంగా హాజరు కావలసిన జిల్లా పంచాయతీ అధికారి, జిల్లా పరిశ్రమల శాఖాధికారి రాని కారణంచేత, చర్చించ వలసిన ముఖ్య అంశములను వచ్చే సమావేశమునకు వాయిదా వేయవలసి వచ్చినది.

నేటి సమావేశంలో యీ ఫిర్కాలోని గరిసెల పహాకార సంఘాలు, పశువైద్యం, వ్యవసాయం, రోడ్లు, బావులు, ఆరోగ్యం, వీటి విషయమై జరిగిన పనిని సమీక్షిస్తూ ఆయా శాఖల అధికారులు తాముత యారు చేసిన నివేదికలను చదివి వినిపించి అధ్యక్షునికి సమర్పించారు.

తర్వాత ఎ కన్నయ్య నాయుడుగారు యీ ఫిర్కాలో మరామత్తులు చేయవలసిన చెరువులు, కాలువల యొక్క వివరాలను తెలుపుతూ అధ్యక్షునికి ఒక నివేదికను అందజేశారు. (స్వ. వి.)

## తిరుత్తని తాలూకా ఆహార సంఘం

తిరుత్తని, డిసెంబరు 22: తిరుత్తని తాలూకా ఆహార సంఘసభ్యుల సమావేశము నిన్నటిదిన మీయూరిలో చంద్రగిరి రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు అధ్యక్షతన జరుపుటకు నిశ్చయింపబడి యుండినది కాని గత ఆరు సమావేశములకు వలెనే, రావలసినంతమంది సభ్యులు యీ సమావేశమునకు గూడా రానందున కోరంలేదను కారణముతో సమావేశము వాయిదా వేయబడినది.

బాధ్యతాయుతమైన ఆహార సంఘ సభ్యులు వరుసగా ఐదు సమావేశములు ఈ రీతిగా జరుగకుండా చేసినందున యీ సంఘమును రద్దు చేసి వేరే ప్రాతినిధ్యముతో ప్రభుత్వమువారు యీ సంఘమును పునర్ధరించుట మంచిదని ప్రజలందరు అభిప్రాయపడుచున్నారు. (స్వ. వి.)

# కడపజిల్లా ఆహార సంఘ సమావేశం

కడప, డిసెంబర్ 24: ఈ జిల్లా ఆహార సంఘ సమావేశము జిల్లా కలెక్టరు బి. మాధవరావుగారి అధ్యక్షతను జరిగినప్పుడు జిల్లా సప్లయి ఆఫీసరుగారు, ప్రస్తుతమున్న ఆహారధాన్యాల నిల్వ, అది ఎంతకాలం వరకు వచ్చునదీ, ఇంకా ఎంతవరకు రాబోవుచున్నదీ మొదలగు వివరాలు తెలియజేశారు. చక్కెర ప్రస్తుతం 85 టన్నులు నిలవ యున్నదనియు, యీ నెలకు 300 టన్నులు ప్రత్యేకించబడినదనియు చెప్పారు.

ఆహారోత్పత్తి సంఘము, హరిజనోద్ధరణ సంఘము, నేషనల్ సేవింగ్సు సంఘము, రాజకీయ బాధితుల సంఘముయొక్క సమావేశములు కూడ జిల్లా కలెక్టరుగారి అధ్యక్షతను జరిగినవి. రాజకీయ బాధితులకు భూములనిచ్చు విషయమున, ఈతవనములుగల భూములను ప్రభుత్వసలహాపొంది యివ్వటమునని నిర్ణయం చేయబడింది.

జిల్లా మద్యపాన నిషేధ సలహాసంఘ సమావేశంకూడ కలెక్టరు బి. మాధవరావుగారి అధ్యక్షతను జరిగింది. జిల్లా మద్య నిషేధ శాఖాధికారిగారు, నవంబరు నెలలో జిల్లాయందు ఏ ఏ గ్రామాలలో వంట సారాయి తయారుచేయువారి నెందరిని పట్టుకొన్నదీ, మొదలైన వివరాలు తెలియజేశారు. (స్వ. వి.)

## టెక్కలితాలూకా రైతు కాంగ్రెస్ కార్యవర్గ సమావేశం

శ్రీకాకుళం, డిసెంబరు 24: టెక్కలి తాలూకా రైతుకాంగ్రెస్ కార్యవర్గసమావేశం బి ఎం. రెడ్డిగారి అధ్యక్షతను గత శనివారం జెండాపేటలో జరిగినప్పుడు యీక్రింది తీర్మానాలు చేశారు. తాలూకాలోగల అమానీ గ్రామాలకు రైతు ప్రమేయం లేకుండా తయారు చేయబడిన జమీందారీఅంచనాలెక్కలను ఆధారంగా చేసుకొని, శిస్తు తగ్గింపు శాసనం అమలు జరిపినయెడల రైతులకు విపరీతంగా నష్టం సంభవించగలదనీ, కాబట్టి, ప్రభుత్వం తగినచర్య తీసుకొని, రైతులకు రక్షణ ఒసంగవలెనని కోరటమైనది. ఇటీవలవచ్చిన తుపానువల్ల టెక్కలి ఫిర్కాలోగల జండాపేట, గామకృష్ణాపురం, దాశరథీపురం, సింగుమహంతిపేట, పెద్దకోళ్ళ పల్లి, ఈయ్యాలపేట చెరువుల దెబ్బతిన్నవనీ, వీటినివెంటనే మరమ్మతు చేయించవలెనని ప్రభుత్వమును కోరటమైనది. పలాసా ఫిర్కాలోగల 'తొంటిగాయ' ఆనకట్ట (భూను) తుపానువల్ల దెబ్బతిన్నదనీ, దీనిని తక్షణం మరమ్మతు చేయించాలనీకూడా కోరారు. వ్యవసాయశాఖ ద్వారా ప్రభుత్వం రైతాంగమునకు మంజూరు చేస్తున్న తక్కావీబుణం రు 80 లనుండి రు 240 లకు హెచ్చించబడినదని ప్రభుత్వం ప్రకటించినప్పటికీ, ఆ విధంగా అప్పులివ్వబడటం లేదనీ, తుపాను బాధితులైన రైతులను ప్రత్యేకంగా పరిగణించి, వెంటనే అప్పులు మంజూరు చేయ్యాలనీ ప్రభుత్వమును కోరటమైనది. స్వ. వి.

## నూతన రాజ్యాంగంతోపాటు ఆంధ్రరాష్ట్రం ఏర్పడాలి

### ఉ. వి. జిల్లా పత్రికారచయితల సంఘం తీర్మానాలు

శ్రీకాకుళం, డిసెంబర్ 20: నూతన రాజ్యాంగంతోపాటు ఆంధ్రరాష్ట్రావతరణకూడా జరిగితీరాలని ఉత్తరవిశాఖజిల్లా పత్రికా రచయితలసంఘం మొన్న నిచ్చట సమావేశమై తీర్మానించింది. ఈ సంఘమును దక్షిణభారత పత్రికా రచయితల ఫెడరేషనునందు కార్పొరేటు మెంబరుగా చేర్చుటకును, సంఘసభ్యులందరు అందు సభ్యులుగా చేరుటకునుకూడ తీర్మానించడమైనది.

1950 సంవత్సరానికి పి. యస్. ఆచార్య అధ్యక్షుడుగను, తిమ్మరాజు వెంకటశివరావు ఉపాధ్యక్షుడుగను, జె వి. యస్. రావు ప్రధానకార్యదర్శిగను, పి. పుండరీకాక్షాచారి సహాయ కార్యదర్శిగను 8 గురు కార్యనిర్వాహక సభ్యులును యెన్నికయిరి.

### హిందీ ప్రచారము

ఆం॥ రా॥ హిందీప్రచార సంఘ సంచాలకుడు చిట్టూరి లక్ష్మీనారాయణ శర్మగారు, ఇచ్ఛాపురం, బరంపురం, సోంపేట, నాపడా, టెక్కలి, నర్సన్నపేట, శ్రీకాకుళం పట్నాలలోని హిందీ ప్రేమీ మండలులలోను, బహిరంగ సభలలోను నూతన రాజ్యాంగములో హిందీ భాషా ప్రాముఖ్యతవహించునదియు పద్యులు హిందీనేర్వాలని ఉద్బోధించిరి.

## త్యాగరాజ ఆరాధనోత్సవములు

ఒంగోలు, డిసెంబరు 24: ఇక్కడ బండా కోటయ్యగారి త్యాగరాజ మందిరములో జనవరి 4 వ తేది మొదలు 10 వ తేదివరకు త్యాగరాజ ఆరాధన మహోత్సవములు జరుపబడునని కార్యనిర్వాహకులు తెలియజేయుచున్నారు.

# చిట్టేలలో 70 ఏండ్ల వృద్ధుని సాహసచర్య

## తన ఇంటిపై దాడిచేసిన కమ్యూనిస్టులకు గుణబోధ

విజయవాడ, డిశంబరు 25: చిట్టేల గ్రామవాస్తవ్యుడు కొల్లి బుచ్చయ్య అను డెబ్బది ఏండ్ల వృద్ధుడు, తన ఇంటిమీద అర్ధరాత్రి దాడిచేసిన సాయుధ కమ్యూనిస్టులపై నిర్విరామంగా తుపాకిగుండ్ల వర్షం కురిపించి, తగులబడుచున్న ఇంటిలోనుండికూడా పోరాడినట్లు ఆంధ్ర రాష్ట్రకాంగ్రెసు కార్యదర్శి కందుల ఓబులరెడ్డిగారు తెలియజేశారు. డిశంబర్ 21 తేదీరాత్రి తిరువూరు తాలూకాలోని కోడూరు, గొల్లమందల, అట్లప్రగడ, ముచ్చినపల్లి, మాధవరం, కూనపరాజుపర్వ, చిట్టేల గ్రామములపై హైదరాబాదు పోలీసుదుస్తులు వేసుకొని సాయుధ కమ్యూనిస్టులు దాడిచేసి, చంద్రయ్యా, సుబ్బయ్య, మాధవరావు, అప్పలరాజు, అంబటి సుబ్బయ్య, మరి ఇద్దరు వ్యక్తులను హత్యచేసిన వార్తనువిని, ఓబులరెడ్డి, గొట్టుముక్కల రామచంద్రరాజు, పికికిటి రామకోటయ్య, తిరువూరు వెళ్లి తిరిగి వచ్చిన అనంతరం యీ కింది ప్రకటన చేశారు.

స్టాలిన్ డెబ్బదియవ జన్మదినోత్సవమునకు తమ కానుకగా, కమ్యూనిస్టులు ఏడు ప్రాణములను తీసిరి. కాని డెబ్బది ఏండ్ల వృద్ధు అయిన కొల్లి బుచ్చయ్య, కమ్యూనిస్టులపై డెబ్బది తుపాకిగుండ్లను కురిపించెను. కమ్యూనిస్టు లీ దాడిని ఒక నిర్ణీత పథకప్రకారము చేసిరి. చొడి, బంగారములను దోచుకొనిరి గొంతులు కోసిరి చేతులు కట్టివేసి కాల్చిరి. బుచ్చయ్యగారింటిమీద దాడిచేసిన దళమును నడిపినది "సంగీతం నాగయ్య" అని బుచ్చయ్యగారు గుర్తించారు. మిగిలిన దాడిదారులు "సినిమాలలోని దొంగలవలె గంతలు కట్టుకొనిరి". 21 వ తేదీరాత్రి భోజనము ముగించుకొని బుచ్చయ్యగారు పరుండిరి. ఇంతలో హైదరాబాదుపోలీసుదుస్తులు వేసుకొనినకమ్యూనిస్టులు దొడ్డితోవన ఇంటి ముంగిలికివచ్చి నసారాలో పడుకొనియున్న యీనాదిని లేపి, "పోలీసులు వచ్చారు, బుచ్చయ్యగారిని రమ్మని చెప్పు" అనిరట. కాని బుచ్చయ్యగారి కావార్తను చేరవేయుటకు యీనాది నిరాకరించెను అంత కమ్యూనిస్టు లాతనిని స్తంభమునకు విరచికట్టిచావకొట్టిరి. ఈ ఘర్షణమువిని బుచ్చయ్యగారు తన డబుల్ బారల్ తుపాకిని తీసికొనిపోవుచుండెను. ఇంతలో అన్ని కిటికీలనుండి, ఇటికలనికి టార్చిలైట్లు వెలుగుసాగినవి. అమాంతముగా కిటికీలనుంచి, తుపాకులు, పిస్టోళ్ళు ప్రేలనారంభించినవి. మరోక ప్రక్క తలుపులను బద్దలగొట్టుటకు గొడ్డళ్ల మోత ప్రారంభమయినది. బుచ్చయ్యగారి మేనగోడలు కాల్పులనాపమని, ఆస్తిపాస్తుల నన్నింటిని వారికే కట్టబెట్టగలమని, కేక వేయగా, తుపాకిని తమకిచ్చివేసినచో వెళ్ళిపోవుదుమని కమ్యూనిస్టులు జబాబిచ్చిరట, కాని బుచ్చయ్యగారు తుపాకిని వదలలేదు. ఎదురుకాల్పులు సాగించెను. ఫలితముగా ఇద్దరు కమ్యూనిస్టులు కూలిపోయిరి. ఇక లాభము లేదనుకొని కమ్యూనిస్టులు పెట్రోలుపోసి తలుపులకు నిప్పు ముట్టించిరి, అది సరిగా అంటుకొనలేదు. అంతట పెంటిలోనికిపోయి గడ్డితెచ్చి, పెంకులులాగి ఇంటికి ముట్టించిరి. ఈలోగానే బుచ్చయ్యగారి మేనగోడలు తలుపు తెరచుకొని బయట పడెను; ఇల్లు తగులబడుట ప్రారంభమయ్యెనుగాని బుచ్చయ్యగారు మాత్రం గుండ్లవర్షం కురిపించుచునే యుండిరి.

ఇంక లాభంలేదనుకొని కమ్యూనిస్టులు పారిపోయే ప్రయత్నంలో పడిరి. పైగా ఇద్దరు కమ్యూనిస్టులుకూడా బుచ్చయ్య తుపాకికి బలి అయ్యారు. బుచ్చయ్యగారు కూడా గొడ్డచావడినుంచి బయట పడిరి. అంతవరకు కాల్పుల శబ్దాలన్ని వింటూ, ప్రాణభయంతో ఇల్లువదలి బయటకు రాని గ్రామస్థులు, వెంటనే ఇండ్లువదలి బయటకువచ్చి మంటలను ఆర్పిరి. బుచ్చయ్యగారు ప్రస్తుతం తిరువూరులో ఉన్నారు.

తిరువూరు ఆసుపత్రిలో సుబ్బయ్యగారనువారు తలమీద, పొత్తికడుపుమీద, చేతులమీద, పాదాలమీదపడిన కత్తిపోట్లకు చికిత్స పొందుచున్నారు. సుబ్బయ్యగారింటినుండి, వేయిరూపాయల రొక్కమును, ఇరువదిఒక్క వేయి కిమ్మతుగల ఆభరణములను దాడిదార్లు దోచుకొనిరి. ఇంకా నరసయ్య అను వారింటిమీదకూడ పడిరటగాని, వారు ఇంటలేనందువలన, వెడలిపోయిరి" అని ఓబులరెడ్డిగారు తమప్రకటనలో తెలియజేశారు.

ప్రభుత్వము ప్రజలను రక్షించుటలో తగిన శ్రద్ధ వహించుటలేదనీ, పోలీసు ఉన్నతాధికారులు జాగ్రత్త వహించుచున్నను క్రిందిపోలీసులు జాగ్రత్తగా ఉండుటలేదనీ, ఇట్లేసాగిన ప్రజలకు కాంగ్రెసుమీద కాంగ్రెసు ప్రభుత్వము మీద విశ్వాసము సన్నగిల్లునని ఓబులరెడ్డిగారు హెచ్చరించారు బాధితులకు, చనిపోయినవారి కుటుంబములకు సానుభూతిని తెల్పుచూ,

# ఆంధ్రరాష్ట్ర సినిమా ఉద్యోగుల సంఘ వార్షికోత్సవం

## కామరాజుగారి స్వాగతోపన్యాసం

విజయవాడ, డిశంబర్ 25: "జరువాడను మన రాష్ట్ర రాజధానిగా చేయదలపెట్టుట వివేకవంతమను నిర్ణయము కాగలదు. ఇక్కడ చలనచిత్ర పరిశ్రమకు ఉజ్వలభవిష్యత్తు ఉన్నట్లు తోచుచున్నది." అని జి కామరాజుగారు నేడుదయ మిచ్చట ప్రారంభమయిన ఆంధ్ర రాష్ట్ర సినిమా ఉద్యోగుల సంఘ నాల్గవ వార్షిక సభాసభ్యులకు స్వాగతమిస్తూ అన్నారు.

కామరాజుగారు తమఉపన్యాసములో యజమానుల కష్టనిష్టూర్యములను ఉద్యోగులు అర్థముచేసికొని ప్రవర్తింపవలెననియు, ఉద్యోగుల అవసరములను యజమానులు గ్రహించి సహాయము చేయవలెననియూ విన్నవించిరి. చలనచిత్ర పరిశ్రమలో ఘర్షణ తగదు. శాంతముతో, పరస్పర సహకారముతో ప్రవర్తించినచో, చిత్రపరిశ్రమ అభివృద్ధిచెందును. సినిమా ఉద్యోగుల సంఘమును, యజమానులు, అనుమానదృష్టితో చూడరు. యజమానులు ఉద్యోగులుకలసి చర్చించుకొని, ఒడంబడికలు కుదుర్చుకొనగలరనే ఆశింతును. అని కామరాజుగారనిరి.

విజయవాడ ప్రాముఖ్యతను గూర్చి మాట్లాడుచూ, ఈ పట్టణము ఆదినుంచీ చాలా ప్రాముఖ్యత వహించుచూ వచ్చినదనిరి. ఇచట ప్రస్తుతము రేడియో స్టేషన్ కూడా ఉన్నది. దగ్గరలోనే గన్నవరం విమానాశ్రయము మున్నది. ఆ విమానాశ్రయపు సిబ్బందిని, పరికరములను మరెక్కడకును చేరవేయకుండగా, విమానాశ్రయమును అభివృద్ధిచేసి, దైనందిన రవాణామార్గములో నుంచురనియే ఆశింతును. విజయవాడలో ఫ్లయింగ్ క్లబ్ కూడా రూపొందుచున్నది. యువకులకు వైమానికశిక్షణలభించు అవకాశము రావచ్చును. అని కామరాజుగారనిరి.

మహాసభ విజయవంతము కావలెనని కోరుచూ, రాజాజీ, నెహ్రూ పండితుడు, సర్దార్ పటేల్, మౌలానా ఆజాద్, కళా వెంకటరావు, కుమారస్వామిరాజా, జనరల్ కరియప్ప, భావనగర్ మహారాజా, వి. వి. గిరి, శ్యామప్రసాద్ ముఖర్జీ, కె. సి. నియోగి, జగ్జీవన్‌రాం, యస్ గోపాలస్వామి అయ్యంగార్, మోటూరి సత్యనారాయణ, ఆర్. ఆర్. దివాకర్, భక్తవత్సలం, బెజవాడ గోపాలరెడ్డి, చంద్రమౌళి, సంజీవరెడ్డి, కె. శ్రీనివాసన్ (హిందూ సంపాదకుడు) మొదలైన అనేకులు సందేశములను పంపిరి. (స్వ. వి.)

## గుం. జి. విద్యార్థికాంగ్రెస్ కార్యవర్గ సమావేశం

### వార్షికసభ జనవరి 3-న జరుపుటకు నిశ్చయం

గుంటూరు, డిసెంబరు 21: ఈ జిల్లా విద్యార్థికాంగ్రెసు కార్యవర్గం నిన్న కొడాలి వీరయ్యగారి అధ్యక్షతను సమావేశమై యీ దిగువ తీర్మానములు చేసెను.

ఇటీవల తుపాను వరదలమూలంగా నష్టపడినవారికి సహాయపడవలెనని, యేటుకూరి వెంకటనరసయ్యగారి అకాల మరణమునకు చింతిస్తూ, వారి సన్మానసభకు విద్యార్థులందరూ శక్తికొలది సహాయం చేయవలెనని హెచ్చరించడమైనది. విద్యార్థికాంగ్రెసు ఆశయ, నియమాలకు భంగకరముగా ప్రవర్తించినవారిపై చర్య గైకొనవలెనని రాష్ట్ర విద్యార్థికాంగ్రెసు కార్యవర్గమును కోరడమైనది. జి. వి. కాంగ్రెసు కార్యనిర్వాహణకు నెలకు రూ. 50/-లచొ॥ నిరాశం యివ్వవలసిందిగా కాంగ్రెసును కోరడమైనది. జిల్లా విద్యార్థికాంగ్రెసు 4-వ మహాసభను జనవరి 3-న జరుపుటకుగాను, కొడాలి వీరయ్య, సాయపనేని భద్రయ్య, యస్. కోటేశ్వరరావు, కె. ఉమామహేశ్వరరావు, ఎ. రామయ్య, జెట్టి కృష్ణమూర్తిగార్లతో ఒక కమిటీని నియమించుచూ, సభాస్థలమును, ఆహ్వానసంఘమును వీర్పరచవలసిందిగా వారిని కోరడమైనది. విజయవాడలో యీ నెల 21, జనవరి 1, 2, తేదీలయందు జరుగు ఆంధ్రరాష్ట్ర విద్యార్థికాంగ్రెసు చతుర్థ మహాసభలకు ప్రతినిధులందరు తప్పక హాజరై, వెనువెంటనే జనవరి 3 న జరుగు జిల్లా మహాసభలకు హాజరు కావలసిందిగా కోరుతూ, యింతవరకు పంపని విద్యార్థికాంగ్రెసు సభ్యత్వం, రుసుము, ప్రతినిధుల పట్టీకలు వెనువెంటనే జిల్లా విద్యార్థికాంగ్రెసు, శరాఫ్ కర్షక, అరండల్ పేట, గుంటూరు పంపవలసిందిగా స్థానిక సంఘాలను హెచ్చరిస్తూ తీర్మానించడమైనది.

కాంగ్రెసు సేవాదళమువారికి, హోంగార్డులకు నాలిసిన్ని ఆయుధముల నివ్వవలెనని ప్రభుత్వమును కోరారు. స్వ. వి.

# రేడియో ప్రోగ్రాములు

డిసెంబరు 28 బుధవారం

## మద్రాసు (ఎ)

ఉ 7-30 పి. ఎస్. కాల్య కె. వి. కె. మణి వీణాయుగళము 8-0 ఆంగ్లమున వార్తలు 8-15 ఉదయ సంగీతం రి. 8-30 హిందీపాఠం 8-50 మద్రాసు (బి) వలె. మ 12-30 సి. ఎస్. బాలసుబ్రహ్మణ్యయ్యర్, వయొలిన్ 1-30 ఆంగ్లమున వార్తలు 1-40 సినిమాసంగీతం రి. 2-15 మద్రాసు (బి)వలె 4-0 మద్రాసు (బి) వలె 4-30 పాశ్చాత్య సంగీతం. రి. 5-30 సంగీతోత్సవం ఎలెక్ట్రికల్ రికార్డింగు 6-0 ఆంగ్లమున వార్తలు 6-20 ఎస్. జయలక్ష్మి పాట. 7-0 బి. సీతాలక్ష్మి వీణ 7-30 ఎ. బాక్సిరోజ్ క్లాసికల్ 8-0 సంగీతోత్సవంఎలెక్ట్రికల్ రికార్డింగు 9-0 ఆంగ్లమున వార్తలు 9-15 వయొలిన్ నిలయ విద్వాంసుడు 9-30 మద్రాసు (బి) వలె

## మద్రాసు (బి)

ఉ 7-0 తెలుగున వార్తలు 7-15 మాయవరం రాజం రికార్డులు 7-45 మద్రాసు (ఎ) వలె 8-30 హిందీ పాఠము 8-50 ఎ. గొరికట్టి పాటమ 12-0 కార్మికుల కార్యక్రమం 12-30 మద్రాసు (ఎ) వలె 1-50 తెలుగున వార్తలు 2-15 బి. అచ్యుతరామన్ పాట 4-0 జి. వి. చెల్లమ్మాళ్ పాట సా 5-30 మద్రాసు (ఎ) వలె 6-20 సాయంసంగీతం రి. 6-30 గ్రామసుల కార్యక్రమం పశువుల పోలిమ్యళ్ళకి హెచ్చించుట ప్రసంగం. స. భరద్వాజం. 7 తెలుగున వార్తలు. 7-15 వెంకటేశ్వర సంకీర్తన బృందగానం 8-0మద్రాసు (ఎ)వలె 9-30 సంగీతోత్సవము ఎలెక్ట్రికల్ రికార్డింగు.

## విజయవాడ

ఉ 7 తెలుగున వార్తలు. 7-15 నీలమ్మాకొడంబి రికార్డులు 7-30 సుసర్ల లక్ష్మీనరసింహశాస్త్రి వయొలిన్ 8 ఆంగ్లమున వార్తలు 8-15 సుసర్ల లక్ష్మీనరసింహశాస్త్రి. 8-30 హిందీపాఠము. 8-50 గీతావళి యడవల్లి నాగేశ్వరరావు మ 1తారాపథం (రి) 1-30 ఆంగ్లమున వార్తలు 1-50 తెలుగున వార్తలు. 4 చిత్రవాణి (రి) సా 5-30 మద్రాసు (బి) వలె. 6 ఆంగ్లమున వార్తలు. 6-20 గీతావళి యడవల్లి నాగేశ్వరరావు 6-30 గ్రామస్థుల కార్యక్రమం (మద్రాసునుండి) 7 తెలుగున వార్తలు. 7-30 చిత్రవాణి (రి) 7.45 కవికావ్యము స్వీయకావ్య పద్య పఠనము . 8 మద్రాసు (బి) వలె. 9-0 ఆంగ్లమున వార్తలు 9-15 కథో పనిషత్తులో కవితా మాధుర్యము. తెలుగున ప్రసంగం. ఎం. మాణిక్యళమ్మ 9-30 మద్రాసు (బి) వలె.

## హైదరాబాద్

ఉ 7-30 జోహ్రాబాయ్. ఖయాల్ భైరవి. 7-45రఘువీర్‌సింగ్ భజన. గీత్. 8 ఆంగ్లమున వార్తలు (ఎ ఐ. ఆర్. రిలే) 8 20 ఎ. ఆర్ వెంకట్రామన్ కర్నాటక సంగీతం. 8.50 తెలుగున వార్తలు. 9 15 జోహ్రాబాయ్ దాద్రా ఘజల్. మ॥ 12-30 రికార్డులు. 1 రికార్డులు. 1-30 ఆంగ్లమున వార్తలు. 1-50 తెలుగున వార్తలు (ఎ ఐ. ఆర్ రిలే). సా॥ 5 జోహ్రాబాయ్ ఖయాల్ తుమ్రీ. 5-20 రఘువీర్‌సింగ్ భజన్. 5-35 భజన్ గీత్ రికార్డులు. 6-30 గ్రామస్థుల కార్యక్రమం తెలుగున. 7 తెలుగున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే) 7-15 పశుపోషణ ప్రసంగం. 7-50 రఘువీర్‌సింగ్ గీత్. 8-30 బాబ్యాఖాన్ సారంగి. 8-40 జోహ్రాబాయ్ తుమ్రీ ఘజల్. 9 ఆంగ్లమున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే). 9-15 బాబ్యాఖాన్ సారంగి. 9-25 జోహ్రాబాయ్ దాద్రా ఘజల్. 9-55 శ్రోతలు కోరిన రికార్డులు. 11 ముగింపు.

# మదరాసు ధరలు

మదరాసు, డిసెంబరు 26:

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు వరకు 1-కి ఎవ్వర్డ బొమ్మ సేల్సుటాక్సుతో సహా రు.76-10-0 పెటా బంగారు తులం 115-0-0 సూపరుబంగారు 118-0-0 సీమవెండి తులం 100 కి (రెడీ) 172-8-0 వెండి తులం 1-కి 1-12-0.

వేరుసెనగ: (581 పౌ 1-కి ఎక్స్ కోస్టాగిడ్డంగులు) మెషీన్ (సేల్సుటాక్సుతో సహా) బజారు కొత్తది రు. 170-0-0 (కోరమండల్)

వేరుసెనగనూనె ఎక్స్ పెల్లర్ (వినరేజ) జనవరి డిలవరి రు. 341-0-0 రు. 345-0-0విలో 3% యఫ్. యఫ్. ఎ. కొంకాయనూనె (87 పౌన్లు ల) ఒకటికి కొచ్చిన్ క్వాలిన్. రు. 39-0.9

### ఆముదం

| | |
|---|---|
| కొండ గింజ కొత్తది | రు. 260 |
| (ఒంగోలు, నరసరావుపేట) | రు. 270 |

### పంచదార

| | | |
|---|---|---|
| హాసన్‌పూర్ | ,, | రు. 98-14-0 |
| మోతీపూర్ | ,, | రు. 94-7-10 |


కూరు తేనె

(సంవత్సరము పాడుగూడా కొనుగోలుండి)

ప్యాక్ చేసినవారు

కూరు హనీ అండ్ వాక్సు ప్రొడ్యూసర్సు కో-ఆపరేటివ్ సొసైటీ, లిమిటెడ్, వీరాజ్ పేట, కూర్గు (దక్షిణ ఇండియా)

కావలసినవారు దిగువ అడ్రసుకు వ్రాయుండి:

పద్మా ఏజన్సీస్

కమిషన్ ఏజంట్లు, దిగుమతిదార్లు, ఎగుమతిదార్లు జనరల్ డిస్ట్రిబ్యూటర్లు.

పట్నం బజారు, గుంటూరు. (ద. ఇం.)

ఆంధ్రరాష్ట్రానికి మా సోల్ ఏజంట్లు మా స్టాకిస్టుల పట్టీలో చేరండి.

WANTED

Agents & Stockists to sell

MADURA RAMSUNDAR READYMADE GARMENTS

In Hyderabad & Andhra Areas.

Decent commision allowed for wholesale supplies.

B & C Mill Goods a speciality-For Business terms Contact immediately:

"RAMSUNDAR" READYMADE SALES DEPOT, 116, Nyneappa Naick St., Madras.

జర్మన్ కెమేరా

యుద్ధానంతరం దిగుమతి చేయటం యిదే మొదటిసారి. ప్రారంభకుడు గూడ యీ కెమేరాతో పెద్దసైజు 6×6 ఫోటోలు తీయవచ్చును. ఖరీదు రు 15-0-0 పోస్టేజి రు 1-8-0 అధికం. 12 ఫోటోలకు ఫిలిం ప్రతి కెమెరాతో ఉచితంగా ఇవ్వబడును. PARKER WATCH Co., 166, Harrison Road, Calcutta.

ఉచితము

ప్రసిద్ధి చెందిన బ్లాక్ ఆయిల్ నెం 555 దు డీలక్సు వాడడంవల్ల నెరసిన కురులు శాశ్వతంగా నల్లపడతాయి. జుట్టు రాలిపోవడం ఆపడమే కాకుండా అందమైన నిడుపాటిఉంగరాల జుట్టు పెరగడానికి తోడ్పడుతుంది. బట్టతలను నివారించును. మెదడుకు చల్లదనాన్ని చేకూర్చుతుంది. సువాసన కలది. ఒక సీసా వెల రు 2-4-0లు పూర్తికోర్సు మూడు సీసాలు రు 5-15-0 లు. ఈ నూనెను గురించి ప్రజలలో ప్రచారం చెయ్యడంకోసం ప్రతి సీసాతోపాటు ఒక ప్యాస్సీరిస్టువాచ్ (10సంవత్సరాలు గ్యారంటీ చెయ్యబడింది.) ఒక లండన్ న్యూగోల్డు ఉంగరం ఉచితంగా ఇవ్వడానికి నిశ్చయించాము.

షరా; సరకు వచ్చకపోతే దర పూర్తిగా వాపసు చేస్తాము, మూడు సీసాలు ఒక్కసారి కొనేవారికి పోస్టేజీ ఉచితం. పైగా నాలుగు ఉంగరాలు. 4 గడియారాలుకూడా ఉచితంగా వస్తాయి. వెంటనే త్వరపడండి. ఈ అవకాశం మించితే మళ్ళీరాదు. ఉత్తరప్రత్యుత్తరాలు ఇంగ్లీషులో మాత్రం జరపండి.

NAVJIWAN PHARMACY, Putli Ghar AMRITSAR.

ప్రకటన

ఇండస్ట్రీస్ అండ్ కామర్సు డిపార్టుమెంటు, మద్రాసు. (మద్రాసు ప్రభుత్వము)

గుమాస్తాలలోని గవర్నమెంటు

సెరమిక్ ఫాక్టరీలో తయారగు సరుకులు ఈ దిగువ ప్రదేశములలో డిస్ట్రిబ్యూటరులకు ఏజన్సీలు తీసికొనుటకు సుసాపితమై యున్న వ్యాపారసంస్థలు లేక ప్రముఖులైన వ్యాపారస్థులు దరఖాస్తులు పంప వలసినదిగా కోరడమయినది.

(i) మద్రాసుపట్టణము, మద్రాసురాజధాని దక్షిణ జిల్లాలు, మైసూరు, తిరువాన్కూరు. కొచ్చిన్ సంస్థానములు.

(ii) మద్రాసు రాజధాని ఉత్తర జిల్లాలు, హైదరాబాదు సంస్థానము.

షరతులకు, నిబంధనలకుగాను వ్యాపారానుభవము, ఇప్పుడు చేయుచున్న వ్యాపారము మొదలగు వివరములను తెలియజేయుచు డైరెక్టరు ఆఫ్ ఇండస్ట్రీస్ అండ్ కామర్సు, మద్రాసుకు 1950-వ సం॥ జనవరి 1-వ తేది దాటకుండ వ్రాయవలెను.

డైరెక్టర్ ఆఫ్ ఇండస్ట్రీస్ అండ్ కామర్సు.


Edited, Printed & Published by S Sambhu Prasad at the Andhra Patrika Press, No.7, Thambu Chetty St, Madras